శ్రీ

శివాభ్యాంనమః

# భారతమంత్రులు.



ఇయ్యది

తెనాలి గ్రామవాస్తవ్య

మహోపాధ్యాయ

బ్రహ్మశ్రీ, ముదిగొండ నాగలింగశాస్త్రిచే

విరచితము



వీరిచే

మద్రాసు శారదా ముద్రాక్షరశాలయందు

ముద్రాపితము.



1937



Price: 0—12—0]        [వెల 0—12—0

శ్రీరస్తు.

# భూమిక.

---

సహృదయమహాశయులారా!

బాలురకుఁ బఠనీయములగు వానిలో నీతిబోధకాఖ్యానకములే ముఖ్యమనుటయు, అందును రాజనీతివిశారదులై భరతఖండ సామ్రాజ్య ప్రతిష్ఠాపనధురీణులైన మహామంత్రులచరిత్రములు సంకటసమయములయందుఁ దన్ను నాశ్రితుని నుద్ధరించు నుపాయములను స్ఫురింపఁ జేయునవి యగుటం జేసి ప్రతిభాతిశయసాధకంబులనుటయు మీరలెఱుంగనిదిగాదు. అట్టి మహామంత్రులలోన నగ్రగణ్యుఁడైన యౌగంధరాయణుని ప్రతిభావిశేషమును దెలుపు నుదయనుని చరిత్రము శ్రీమహాకవి కాళిదాసునిచే మేఘదూతమున నుజ్జయినీపురవర్ణనఘట్టమున శ్లో॥ ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజో౽త్రజహ్రే॥ వత్సరాజు ప్రద్యోతుని ప్రియపుత్రిక నపహరించెనని తెలుపఁబడియెను. దీనింబట్టి నీపుర సంబంధములగు ప్రాచీనచరిత్రములలో నుదయనచరిత్ర మత్యద్భుతాఖ్యానకమని స్పష్టమగుచున్నది. ఇందు వత్సరాజును బట్టనెంచి భరతరోహకుఁ డనుమంత్రివరుఁడు కృత్రిమగజమును నిర్మించెననుటచేఁ బూర్వకాలమున భరతఖండవాసులకుగల యంత్రనిర్మాణకుశలత వ్యక్తమగుచున్నది. ఈచరిత్రము ప్రతిజ్ఞాయౌగంధరాయణము మొదలగు భాసమహాకవి

నాటకములనుండి గ్రహింపఁబడియెను. ఉదయనుఁడు భారత వీరవరుఁడైన యభిమన్యునకుఁ బదునేనవవాఁడనుటంబట్టి కలి యుగమున నన్నూఱువత్సరంబులు గడచిన కాలమున యౌగంధరాయణుఁడు రాజ్యతంత్రము నడిపినట్లు తోఁచు చున్నది.

యౌగంధరాయణుఁడు చాణక్యునకుఁ బూర్వుఁడు. ఏలన, శ్లో॥ నన్దాంతం క్షత్రియకులం॥ క్షత్రియకులము నందులతో నంతమొందునని పురాణముల యందుఁగలదు. ఆవచనమునకు నందులతో క్షత్రియప్రభుత్వ మంతరించుననునర్థము గ్రహించినను పాండవవంశ్యుడగు నుదయనుఁడు నందుల తరువాత పుడమి శాసించుట యసంభవముగాన నారాజన్యునకు నమాత్యుఁడైన యౌగంధరాయణుఁడు చాణక్యునకుఁ బ్రాచీనుండనుట నిర్వివాదము.

చాణక్యునుద్దేశించి విష్ణుపురాణమునందు, నవచైతాన్నందా న్కౌటిల్యో బ్రాహ్మణస్సముద్ధరిష్యతి। కౌటిల్యఏవ చంద్రగుప్తం రాజ్యేఽభిషేక్ష్యతి। అతఃపదం శూద్రాఏవ పృథివీం భోక్ష్యన్తి॥ నవనందులను కౌటిల్యుఁడను బ్రాహ్మణుఁడు నిర్మూలముసేయును. ఆకౌటిల్యుఁడు చంద్రగుప్తుని రాజ్యమున నభిషిక్తుని గావించును. తరువాత శూద్రులే భూమినిఁ బాలింతురు- అనియున్నది. బృహత్కథయందు,

శ్లో॥ చాణక్యనామ్నా తేనాథ శకటారగృహేరహః।
కృత్యాంవిధాయ సప్తాహాత్సపుత్రో నిహతోనృపః॥

చాణక్యుఁడు క్షపణక వేషధారియగు నిందుశర్మ గృహమున నాభిచారికవిధిచే కృత్యనుబుట్టించి యేడుదినములలో సపుత్రకుఁడగునందరాజును జంపెనని యున్నది. కామందక రచితమగు నీతిశాస్త్రమునందును,

శ్లో॥ యస్యాభిచార వజ్రేణ వజ్రజ్వలన తేజసః।
పపాత మూలతశ్శ్రీమా న్సుపర్వానంద పర్వతః।
నీతిశాస్త్రామృతం శ్రీమానర్థ శాస్త్రమహోదధేః।
యఉద్దధే నమ స్తస్మై విష్ణుగుప్తాయ వేధసే॥

ఎవ్వని యాభిచారిక వజ్రముచే నందకుల పర్వతము మొదలంటఁగూలెనో అర్థశాస్త్ర సముద్రంబునుండి నీతిశాస్త్రామృతము నెవ్వండుద్ధరించెనో అట్టి విష్ణుగుప్తునకు నమస్కారమని యున్నది.

ఈవచనమునుబట్టి చాణక్యుఁ డాభిచారికవిధిచే నందరాజుల వధించినట్లు తెలియుచున్నది. అయినను ముద్రారాక్షసమునందుఁ దత్కర్తయగువిశాఖదత్త మహాకవి యాభిచారిక ప్రయోగము నీతికుశలతకు సాధకముగాదని యోజించి చాణక్యుఁడు పర్వతేంద్రునితో సంధిచేసికొని యాతనిచే నందులను ధ్వంసముసేయించినట్లు తెలిపెను. చాణక్యుని ప్రతిభాతిశయమును బ్రకటింప ముద్రారాక్షసమే తగియుంటంజేసి యదియే చాలవఱకు సంగ్రహింపఁబడియెను. చాణక్యుండు జీవితకాలమెల్ల మంత్రిపదమున వసింపకున్నను మంత్రశక్తిచే చంద్రగుప్తునకు రాజ్యము నొసఁగుటయెగాక యుపాయ కౌశలముచే మంత్రి

రాక్షసుని నిగ్రహించి సామ్రాజ్యము సుప్రతిష్ఠితముగావించు టవలన మంత్రివరుఁడు గానెయిందుగ్రహింపఁబడియెను. చంద్రగుప్తునికాలము క్రీ.పూ. 322 గావున చాణక్యుఁడునప్పటివాఁ డేయగు.

ముద్రారాక్షసము ప్రతిజ్ఞాయౌగంధరాయణము నను నాటకములిందు సంగ్రహింపఁ బడుటను ఇదియె సుబోధకమగు టను రచన ప్రాయికముగా సంభాషణ రూపముగానె స్వీకరింపఁబడియెను.

తరువాత యుగంధరుని ప్రతిభనుదెలుపు ప్రతాపరుద్ర చరితంబును తిమ్మరుసుచరిత్రంబును, సుప్రసిద్ధములగుటచే సంగ్రహరూపముగా గ్రహింపఁబడియె.

ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౬ మొదలుకొని ౧౩౨౩ వఱకు రాజ్యము చేసినట్లు చరిత్రకారులు తెలుపుచున్నారు.

ఈగ్రంథము పూర్వరాజుల చరిత్రములను మహామంత్రులచరిత్రములను దెలుపునదియగుటను ఈదేశచరిత్రమునకుసంబంధించినదగుటను నభిమానము వహించి దీనిని బాలభాషాశిక్షకు వినియోగింపఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు
మహామహోపాధ్యాయ
ముదిగొండ నాగలింగశాస్త్రి
తెనాలి.





శ్రీ

శివాయ గురవేనమః.

# భారతమంత్రులు.

## యౌగంధరాయణుఁడు.

### ప్రథమ ప్రకరణము.

#### కార్యాలోచనము.

శ్రీమండితమగు భరతఖండమునందు వత్ససంజ్ఞతోనొప్పు నొకదేశము గలదు. దానినిఁదొల్లి యుదయనుఁడను రాకుమారుఁడు కౌశాంబీపట్టణము రాజధానిగాఁ జేసికొని పాలించుచుండెను. ఈరాజన్యుఁడు భారతవీరవరుండగు నభిమన్యునకుఁ బదునేనవవాఁడు. ఈధరాధిపునందు లేనిసుగుణము వాఙ్మయముననె లేదు. దాననే యీతనిగుణజాతంబునకు మెచ్చి వాసుకితమ్ముఁడు వసునేమియనువాఁ డమ్లానమగుపుష్పహారమును, నిజనాదసమ్మోహిత సకలజంతుజాతమగు ఘోషవతియను వీణావిశేషము నీతనికొసఁగి మైత్రి నార్జించుకొని యుండెను.

ఈరాజచంద్రునకు యుగంధరుఁడనుమహామాత్యునిపుత్రుఁడు యౌగంధరాయణుఁడు ముఖ్యమంత్రిగా నుండెను. మఱియు రుమణ్వంతుఁడు హర్షరక్షితుఁడునని యిద్దరుమంత్రులుండిరి. ఆనరపతి యీముగ్గురుమంత్రులఁగూడి ధర్మపథంబునఁ బ్రజలం బాలింపుచుండెను. ఈయిలాకళత్రుండు సకలకలాకోవిదుండై గాంధర్వరసికుండగుట రాజ్యభరంబు మంత్రులపైనునిచి ఘోషవతిన్మ్రోయించుచు తదీయనినదంబునకుఁ జొక్కి యేతెంచుమదపుటేనుంగులఁ బట్టుకొనియాడించుచుఁ బెక్కుకాల మడవులయందు బ్రొద్దులుపుచ్చుచుండును.

ఆకాలమునఁ బ్రద్యోతుఁడనుభూవరుఁ డుజ్జయినిం బాలించుచుండెను. అతఁ డప్పురమునవెలకొన్నమహాకాళేశ్వరునకు భక్తుఁడు. ఈతేఁడొకప్పుడు వింధ్యవాసినియగుమహాకాళినిఁ బ్రణుతిసేసి మెప్పింప నమ్మహాదేవి యాతని కొకఖడ్గంబునొసఁగి యిద్దానిచే వైరివర్గంబునెల్ల నునుమాడుదువని వరంబొసఁగి యనిచెను. ఆవీరవరుండు దేవీదత్తఖడ్గప్రభావంబున వైరిభీకరుండై చండమహాసేనుఁడను పౌరుషనామము వహించి యుండెను. ఆతం డొకపరి పాతాళంబునకుఁబోయి యందొకరక్కసుందునిమి వానికూఁతు నంగారవతియనులావణ్యవతిని భార్యగా గ్రహించి యామెయందు గోపాలానుపాలురను నిద్దఱుకొమరులను, వాసవదత్తయనుకన్నియను గనియెను.

ఆకన్నియరూపంబు కలావిభవంబును ద్రిభువనలాలనీయంబై యుండెను. వత్సరాజాయన్నువమిన్నగుణగణంబు

నాలించియు చండమహాసేనుని ఖడ్గప్రభావమునకు శంకించి కాలము ప్రతీక్షించుచుండెను.

అట్లుండ నట చండమహాసేనుండు తనకన్నియకు జవ్వనంబు పెంపొందఁ దగినవరు నన్వేషించుకుతుకంబున భరతరోహకాదిమంత్రుల రావించి యిట్లనియె.

మంత్రిముఖ్యులారా! మనవాసవదత్తకు దగినవరునిఁ గులశీలరూపవిద్యాసమన్వితు నెందేని వెదకి తెలుపుడు. నావుడు భరతరోహకుం డిట్లనియె.

మహారాజా! అవధరింపుము. దేవరయానతికిమున్న యీకన్నియకు శైశవాయంబు దాటినది మొదలుకొని సకల దేశాధినాథకుమారులగుణగణంబు చారముఖంబున విచారించుచునె యుంటిని.

రాజు—నీదూరదర్శిత్వ మేనెఱుంగనా? ఎల్లరలో నీకునచ్చిన రాకుమారు నెఱిఁగింపుము.

భరత—మహాప్రభూ! సకలగుణముల నీకన్నియకుఁదగినవాఁడు వత్సరాజగాక యితరుఁడు కానంబడఁడు.

రాజు—వానిపేరు జెప్పకుము. అపారమగుధరామండలమున లెక్కలేనిరాజపుత్రులుండ వారిలో నెందేనిఁ దగినవాఁడు వేరొక్కఁడు లేఁడయ్యెనా?

భరత—ఎందఱున్న నేమి? కులమున్నచోట రూపముండదు. రూపమున్నచో విద్యయుండదు. విద్యయున్నచో వినయముండదు, వినయమున్నచో బరాక్రమముండదు.

పరాక్రమమున్నచో నీతియుండదు. అన్నియుగావలయు నెడ నుదయనునికన్న నింకొక్కఁడు లేఁడు.

రాజు——ఆతండెంత గుణగరిష్ఠుండైనను మనకు నుపయోగింపఁడుగాన వానిని లెక్కింపకుము.

భరత——అతఁడు మనకేల యుపయోగింపఁడు ?

రాజు——వాఁడు పరాక్రమంబుకలిమిని, యౌగంధరాయణుని సాహ్యమునను నన్ను నించుకేని సరకుసేయఁడు. అట్టి వానిజోలి మనకేమి ? ఇంకొక్కని వెదకుము.

భరత——ఏమిటలోపమున్నను రాకుమారుని వాసవదత్త వరించునా ?

రాజు——అదియునిజమే. దాననేకదా గుణోత్తరునే వెదకవలయును.

భరత——వత్సాధీశునికన్న నింకొకఁడు గుణాధికుఁడు లేడు.

రాజు——అతఁడు సర్వోత్తరుఁడని యేనును విసియుంటి. అట్లయిన నేమిసేయుదు ? నన్నుసరకుసేయనివానిం గన్నియకై యాశ్రయించి యెట్లుజీవింతును ?

భరత——గీ॥ మానభంగము నల్లుఁడు మామకొనరఁ
జేయ నతనికిఁ బ్రతి మామ సేయరాదు
అల సుభద్రనుహరియించునర్జునునకు
ధనము లియ్యరె తొల్లియాదవులు ప్రేమ॥

కావున విచారించుట నీతిగాదు. అయినను నాతని నాశ్రయింపకయ యతండు మనకువశపడునట్లు యత్నించెద.

రాజు—అది యెట్లు?

భరత—అతఁడు గజవశీకరణవిద్య కలిమిచే గజగ్రహణవ్యసనంబుగలవాఁడు. దుర్వ్యసనంబుగలవాఁ డెంతటివాఁడైన నాపదకు గుఱిగాకుండునే? అట్లగుట యేను నీలకువలయంబను కృత్రిమగజంబు సృజించి వానిని వంచించి రప్పింతును.

రాజు—వత్సరాజు మహాకులీనుండగుటయగాక శూరవరుండు నగుటచే మేనఁ బ్రాణంబులుండ నన్యులకుఁ జిక్కననుట యసంభావితము.

భరత—వానికిఁ బ్రాణభయంబు లేకుండనే బంధించి కొనివచ్చునట్లు నీతికౌశలంబు నుపయోగించెద.

రాజు—అట్లొకవేళ నీవు వానిని బంధించి తెచ్చినను వాఁడా క్రోధంబున వాసవదత్తను పరిగ్రహింప నంగీకరించునా?

భరత—అతఁడు మనకుఁ జిక్కిన పదంపడి రాజపుత్త్రి గుణజాతంబె యాతని నంగీకరింపఁ జేయంగలదు?

రాజు—నీ చెప్పినది నిజము. అయినను, ఆవీరుఁడు మనకుఁజిక్కుటయ యరిది. ఒక్కవిధమున నాతండు పట్టువడినను పదంపడి యౌగంధరాయణుండు మనకేమి ముప్పు చొప్పడఁ జేయునో యని యెడఁద వడంకెడిని.

భరత—ప్రభూ! ఆమహామాత్యుం డెంతయైనఁ జేయంగలఁడనుట నిక్కము. అయినను, వాసవదత్తమూలమున

నుదయనునితో బాంధవబంధనము దృఢపడిన మీఁద నాతనిమంత్రి యెంతవాఁడయిన నేమిసేయును?

రాజు—అట్లేని నికార్యంబు సాధింపుము. నావిని భరతరో హకుండు నిజకార్యతత్పరుండయి యుండెను.

---

## ద్వితీయ ప్రకరణము.

### —• వ త్స రా జ గ్ర హ ణ ము •—

అట వత్సాధీశుండు పరిమిత పరిజన సహితుండయి ప్రియమిత్రులగు విష్ణుత్రాతాదులతో యమునాతటినీతటంబునఁ జెలువారునటవులలోఁ జరించుచు నచ్చటచ్చట మత్తగజప్రచారంబు నరసి తనకుఁ దెలుపఁదగుచారుల నియోగించి ఘోర మృగంబులఁ జెండాడుచు మృగయావినోదంబునఁ గొంతసేపును, కమలగంధబంధురజలంబులును, కలహంస కుల కలరవ శోభితంబులును నగు సరోవరంబులయందు జలక్రీడాపరత్వంబున గొంతతడవును, నిజవీణానినదసంమోహితగంధగజగ్రహణకుతుకంబునఁ గొంతకాలంబును, వనవిహారంబు సల్పుచు కాలంబు గడుపుచుండెను.

అట్లుండ నొక వనచరుం డతివేగంబున వచ్చి ప్రణామంబుసేసి యిట్లని విన్నవించెను.

వన—దేవా! నేఁడొక యద్భుతంబగు వనగజంబు గానవచ్చెను.

వత్సరాజు—ఎచ్చట జూచితివి?

వన—నాగవనమునఁ జూచితిని.
వత్సరాజు—అది యెంత దవ్వుననున్నది?
వన—ఒక యామడ దూరమున నున్నది.
వత్స—దాని లక్షణము లెట్లున్నవి?
వన—అది మిగుల యెత్తైనది. అట్టిదానిని నెన్నఁడు కని యెఱుఁగను.

వత్స—అట్లేని నది భద్రజాతి నీలగజము గానోపు నని పలికి యేనిదె యావనగజముఁబట్టి తెచ్చెద మీరిటనుండు డని మిత్రులకు జెప్పి సుందరపాటలంబను నశ్వంబు దేరంబనుప నప్పుడు విష్ణుత్రాతుం డిట్లనియె. ప్రభువర్యా! నాగవనంబు మనదేశంబునకు సీమాంతము. అచ్చోటు నమ్మి యల్ప పరిజనంబుతోఁ బోవ మనకు నర్హంబుగాదు. గాన తగుసేనా సముదయంబుతో నేతెర మాకు ననుజ్ఞయిండు. నావిని మిత్రులారా! వన్యగజబహుళంబగు నాఘోరారణ్యంబు మానవులకు నగమ్యంబగుట నదియెంతయు శంకాస్పదంబు గాదు. నాయెడ భీతిదక్కుఁడు. మనుజగంధం బెఱుంగనియడవియేనుఁగు జనసమ్మర్దంబు నోర్వదు. ఏను ఘోషవతీ ప్రభావంబున దానిం బట్టజాలుదునని చెప్పి వారలనందయుండనియోగించి పదాతులు బదుగురుమాత్రము దోడరా సుందరపాటలంబు నధిరోహించి త్వరితగమనంబున నాగవనంబుసేరి యావన చరుంగాంచి నీవామత్తగజంబు నెటజూచితివి? అదియిపు డెందుఁబోయెనో వెదకుమని వచింప వల్లెయనివాఁడు పోవఁ బ్రభాకరుం డస్త్రాద్రి నధిరోహించెను. అప్పుడారాజచంద్రుం

డొక్క సరోవరంబున సాయంసంధ్య నుపాసించెను. అంత నావనచరుండు మరలివచ్చి దేవా! ఆగజరాజంబిటకుఁ జేరువన మల్లికావేల్లితమగు సాలతరువునొద్ద నున్నది. విచ్చేయుడనిన నాభూమీశుండు తురంగమంబెక్కి వనచరుండు త్రోవఁ జూపుచుండ నేగెను. అప్పుడు వాఁడు 'రాజా! అదె యుత్తుంగమగు మత్తగజము గను' మని చెప్పి వెడలిపోయెను. అంతనారాజు వారువంబుదిగి ఘోషవతిమేళగించి గజార్షిణి రాగంబు నాలాపించుచు దానింజూచుడు నాగజగర్భంబునుండి పెక్కండ్రువీరభటులు వెలువడిరి.

వారింగని యామహీశుండు 'అకటా! ఇది కృత్రిమగజంబు. శత్రువంచనంబునకు లోనైతి. మిత్రులమాట నాలింపనైతి. ఎందేని నత్యాశందవులువడిన వాఁడిడుములకు భాజనుండవుట విదితంబెకదా; ఇట నసహాయుండనగునాకు ధైర్యంబుకన్న వేరుగతిలే'దని యోజించి ఘోషవతిం బరిచరునకర్పించి ఖడ్గంబుధరించి తురంగమంబధిరోహించి నిలిచియుండుటయు కౌశాంబినుండి హంసకుండనుచారుండే తెంచి దర్శింపనీవు యౌగంధరాయణుం గాంచుమని యానతిచ్చెను.

అప్పు డపరిమితసేనానివహంబు వెంబడిరాఁదేజశ్శాలియగు నొకపురుషుఁడు వచ్చి యుదయనున కెదురనిలిచి యిట్లనియె.

పురుషుఁడు—వత్సేశ్వరా! చండమహాసేను నానతి నిన్నుం బట్టుకొనవలయునని పలునాళ్ళనుండి వేచియుంటిమి. నేడు మాకు జిక్కితివి. మానగరంబునకు విచ్చేయుము.

ఉదయ—మహాసేనుఁ డెంతయో శూరుండని వినియుంటి. ఆతఁడు నన్ను వేమఱు పాటున బట్టఁబూన నింతటి భీరుఁడా? కానిమ్ము నీవెవ్వఁడవు?

పురు—నేను సాలంకాయనుఁడను.

ఉదయ—మహాత్మా! నీప్రతిభావివేషంబు బహుకాలమునుండి యాలించుచుమిమ్ము దర్శింప వలయునని యత్నించుచు నేటికిఁ జూడగంటిని. మిముబోటివారికి సహజ విక్రమం బులేనివారి సన్నిధినుంట యనుచితము. గాన నాతో సరుదేరుడు. నాసామ్రాజ్యంబు మీయధీనంబు సేసెద. నేనెన్నఁడేని మిమ్మిట్టి తుచ్ఛకృత్యములకు నియోగింప ను సుఁడీ?

సాలం—రాజేంద్రా! ధర్మవిదుఁడవగు నీకుఁ దెలియని దేమి కలదు? ఎట్టిదైనను ప్రభునకు నచ్చినదే ఘనకార్యము. దాని నెఱవేర్చుట మాకు విహితముగానఁ బోవుదము రమ్ము.

ఉద—మంత్రివరా! ఈసేనంజూచి తలఁకితినని యెంచెదో? ఖడ్గంబు తోడున్నంతదనుకఁ జిక్కుదునని తలంపకుము. మీాతేనిం బంపుము. రిత్తగా సేనలఁజంపుకొననేల? వచ్చినదారిం బొమ్ము.

సాలం—మానధనా! నీశౌర్యం బేనెఱుంగనిది కాదు. నీ వసహాయుండవు. మహాసేనుని సేనలు లక్షలకొలఁది

సన్నాహముతో నున్నవి. పరాక్రమింప నిది యదను కాదు. నీకు శుభంబగును. నామాట వినుము.

ఉదయ — ఈబెదరింపులకు నదరుదునను కొంటివా? సాగరుండు నదీనివహంబులకు బెణంకునే? అభిమన్యువంశ్యు తెన్నఁడేని జన్యంబునకు వెఱచువాఁడు గాఁడు. నీవు బ్రాహ్మణుఁడవు గాన తలంగుము.

సాల — రాజా! హితము విననొల్ల వైతివి. ఏ నేమిసేయుదు? నని యటనుండి తొలంగునంత నా మహీకాంతు ననంతమగు సేనానివహంబు చుట్టుకొనియెను.

అప్పు డప్పాండవవంశ్యుం డాదండునందు క్షీరసాగరంబున మందరమహీధరంబుచాడ్పున దిరుగుచు యోధులను వధించుచుండెను. మహాసేను ననుమతి సాలంకాయనుండు 'వత్సరాజునకుఁ బ్రాణభయంబు లేకుండునట్లు సంగరంబు సేయుఁ'డని యానతియొసంగుటం జేసి వీరభటులు పెక్కండ్రు మడిసిరి. ఆయెడ నొక్కయోధుం డుదయనునశ్వంబు కాలు నఱుక నది నేల కొఱగెను. అంతవత్సరాజు పదాతియై నిజఖడ్గంబున బెక్కురుసైనికులం దునుమాడి కొంతతడవునకుఁ బరిశ్రాంతుఁడయి సొమ్మసిలెను. అత్తఱి సాలంకాయనుఁడు వత్సరాజును బంధించి యుజ్జయినికిఁ గొంపోయెను.

---

# తృతీయ ప్రకరణము.

## యౌగంధరాయణ ప్రతిజ్ఞ.

కౌశాంబీనగరమునందు యౌగంధరాయణుఁడు భరత రోహకుని కపటప్రయత్నమును చారులవలన వినియుండి యీ సంగతి చేనికిఁ దెలుపుమని వత్సరాజునొద్దకు హంసకుఁడను శీఘ్రగామి ననుప వాఁడు పోవువఱకే వత్సాధీశుండు నాగ వనంబు జేరుటచే వార్తాహరుండును నటకేగి శత్రుసేనాపరివృ తుండగునరపతి నవలోకించి మంత్రివార్త విన్నవించి ప్రతివచ నము గ్రహించి యుదయనుఁడు శత్రువులకుఁ జిక్కుట గాంచి మరలి కౌశాంబికిఁ జేరి యౌగంధరాయణుని దర్శించెను.

యౌగంధ—హంసకా! రాజునకుఁ గుశలమా?

హంస—రాజు జీవించియె యున్నాఁడు.

యౌగం—ఇది యేమి? ఇట్లనుచున్నాఁడవు? చేఁడు శత్రువు లకు జిక్కెనా?

హంస—చిక్కెను.

యౌగం—నీవు ముందుగనే రాజునకు నావార్త యేలదెలుప వైతివి?

హంస—నేను పోవువఱకే యధీశుఁడు నాగవనము సేరెను.

యౌగం—హా! ప్రద్యోతుఁ డెంతపని చేసెను. వానిభాగ్యము నేమనవలయు. ఇదిమొదలుగా వత్సరాజుమంత్రులకు

నశక్తియు నకీర్తియు సుస్థిర మయ్యోనే? అప్పుడు దూర దర్శి యగు రుమణ్వంతుం డెందుఁబోయెను? పరివార మేమయ్యెను?

హంస—బలపరివార మంతయు దాపున నుండుచో నీ యనర్థ మేల సంభవించును?

యౌగం—పరివార మేమైనది?

హంస—జరిగినసంగతి వినుడు. మహారాజు వేణువనమున నుండ నొకవనచరుండు వచ్చి నాగవనంబున నొక యద్భుతగజంబు దిరుగుచున్నదియని చెప్పెను. ఆమాట వినగనె మనరాజు వానికి నూఱుసువర్ణనిష్కములు బహుమాన మొసఁగి దానిలక్షణములనుబట్టి నీలకువ లయముగా నుండునని తోఁచెడిని. అట్టిది హస్తికులచక్ర వర్తి యని హస్తిశిక్షయందుఁ జదివియుంటిని. నేనిదె వీణామాత్రసహాయుండనై దానిం బట్టుకొని వచ్చెదనని గమనోన్ముఖుండాయెనట.

యౌగం—అప్పుడు రుమణ్వంతుం డేల రాజు నుపేక్షించెను?

హంస—మంత్రిముఖ్యుఁడు దేవరవారిని బ్రతిమాలికొని దేవా! నాగవనము శత్రుజనులకుఁ జేరువైనదిగాన నటకు మీ రసహాయముగా జనుట యనుచితము. గావున మనము పరివారముతోఁగూడ నేగుదము. అని విన్నవించెను.

యౌగం—అందఱయెదుట నిట్లు చెప్పియుండెనా?

హంస—అవును.

యౌగం—మహారాజు మంత్రికేమి బదులుచెప్పెను?

హంస—వనగజము జనసమ్మర్దము సహింపదు. గాన నాతోడు మీరెవరలును రాకుఁడని సుందరపాటలము నెక్కి వెల్వడియెనని యచ్చటివారు తెలిపిరి.

యౌగం—అంతనీవేమి చేసితివి?

హంస—నేను వారు పోయిన దారినిబట్టి నాగవనము చేరితిని. నేను పోవువఱకే మహారాజు శత్రులచేఁజుట్టుకొనఁబడి యుండెను.

యౌగం—అచ్చట పోరాటము జరిగెనా?

హంస—ఘోరముగాజరిగెను. పెక్కండ్రు వీరభటులుమడిసిరి.

యౌగం—శూరవరుండగుమనఱేడు మేనఁ బ్రాణములుండ వైరుల కెట్లుజిక్కెను?

హంస—మహారాజొక్కరుండు పెక్కండ్రతోఁ బెద్దకాలము పోరి సొమ్మసిలుటచే వారు బట్టుకొనఁ గలిగిరి.

యౌగం—రాజు సొమ్మసిలె నంటివి. ఱేనికిఁ దిరుగఁదెలివివచ్చి నది గంటివా?

హంస—కంటిని. ఱేనికి బాగుగ జాగ్రత కలిగెను.

యౌగం—అట్లని రాజును వారెట్లు బంధించిరి.

హంస—సొమ్మసిలగానె త్రాళ్ళతోఁ జేతులు గట్టివైచిరి.

యౌగం—హా! ఎంతమాట వినవలసెను.

ఆజానుదీర్ఘములు కరికరసదృశములు దేవభూదేవప రిపూజాసక్తంబులు నగుమహారాజుభుజంబులకు గంక ణస్థానంబున బంధనంబు లుంచఁబడియెగదా ? రాజేం ద్రుండు నిన్నుగాంచెనా ?

హంస—చూచెను.

యౌగం—ఏదేనిం జెప్పెనా ?

హంస—యౌగంధరాయణునిఁ జూడుమని చెప్పెను.

యౌగం—మంత్రుల నెల్లరను విడిచి నన్నె చూడుమని చెప్పెనా ?

హంస—అగును.

యౌగం—స్వామ్యన్నము దిని స్వామిచే బహూకృతుఁడగు వానిపోల్కి ప్రత్యుపకారమేమియుఁ జేయనేరకున్నను నన్నుఁ జూడఁదగినవానిగనే ఱేఁడు మన్నించెనా ? తరు వాత నేమిచేసిరి ?

హంస—ఉజ్జయినికిఁ గొంపోయిరి.

యౌగం—ఈయనర్థము సంభవించునోయని యేనుముందుగ శంకించుచునే యుంటిని. ఇదిప్రద్యోతునకుఁ బెద్దకో ర్కిగదా ? కానియిట్టిదశ నున్నమహీకాంతుండు తానింతదనుక లెక్కసేయని మహాసేను నెట్లుచూడగ లఁడు ? అట వారువలుకుతిరస్కారవాక్యంబు లెట్లు వినఁగలఁడు? తనకువానియెడఁగలకోపము నెట్లు లడంచు కొనఁగలఁడు ?

హంసకా! నాప్రతిజ్ఞ వినుము.

రాహుగ్రస్తుఁడగుచంద్రునిఁబోలి శత్రుబలగ్రస్తుఁడగు మహారాజును విడిపింపనైతినేని నేను యౌగంధరాయణుడగాను.

ఇదిగాక వత్సరాజుతో మహాసేనుకూఁతు వాసవదత్తనుగూడ కౌశాంబికిఁ జేర్పనైతినేనియౌగంధరాయణుడనుగాను.

ఆ॥వె॥ కట్టెయల మథింప గలుగదే యట నగ్ని
పుడమిద్రవ్వజలము వొడమకున్నె
ఉండునే యసాధ్య ముత్సాహులకు నీతి
కలన నన్నియత్నములు ఫలించు॥

గాన నాయోచినట్లు యత్నింతును. దీనికిదైవము తోడ్పడవలయు నని వానింబనిచి కార్యపరుండై యుండెను.

---

## చతుర్థ ప్రకరణము.

### — వర నిశ్చయము —

---

ఉజ్జయినీనగరమున నిజసౌధమునందు మహాసేనుఁ డంగారవతియనుతనపత్నితో నిట్లుసంభాషించుచుండెను.

మహాసేను— దేవి! వాసవదత్త యెట నున్నది?

అంగారవతి— ఉత్తరయనుగాయకివద్ద నారదవీణ నేర్చికొనఁ నేగెను.

మహా— దీనికి సంగీతమున నభిరుచియెట్లు లేర్పడెను?

అంగా—కాంచనమాల యనునెచ్చెలి వీణనేర్చికొనుచుండఁ జూచి తానును దానియందు నుత్సుకురాలాయెను.

మహా—చిన్నతనపుచర్య లిట్లే యుండును.

అంగా—దేవరవారివద్ద నొకవిన్నపము సేయదలంచితి.

మహా—ఏ మది?

అంగా—వాసవదత్తకు సంగీతాచార్యు నేర్పరచుఁడు.

మహా—వివాహకాలము సమీపించియుండ నిపు డాచార్యుఁడుదేనికి? భర్తయె నేర్పఁగలఁడు.

అంగా—ఆ! కన్నియ కిప్పుడె వివాహకాలము వచ్చెనా?

మహా—బాగుగా నున్నది. వరుని నాలోచింపుమని యను దినము పోరుచు నిపుడు సంతాపపడియ దేల?

అంగా—వివాహముసేయుట నాకును సమ్మతమే? అయినను నదికాగనె వాసవదత్త యత్తవారింటికిఁ బోవునని తలంపగా సంతాపము గల్గెడిని. వరుని నిశ్చయించితిరా?

మహా—నిశ్చయింపలేదు.

అంగా—ఇంకను నాలోచించుచునే యున్నారా?

మహా—మనకన్నియకై పెక్కురు రాజకుమారులు సందేశముల ననుపుచున్నారు. వారిలోనెవ్వనిని నిశ్చయింపఁ జాలకున్నాను.

అంగా—అధికముగాఁ జెప్పనేల? ఎవ్వని కిచ్చినచో మనము సంతాప మొందమో యట్టివానికి నొసఁగుడు.

మహా—మాట కడుసులభముగా జెప్పితివి. నిశ్చయించుట కష్టము. వరునియందుఁ బదంపడి యేదేని నవగుణము దేటపడునెడ దూఱుటకే నన్ను నిశ్చయింపు మనుచుంటివి. సందేశ మంపినవారిలో నెవ్వనినైన నచ్చినవానిని నీవ నిశ్చయింపుము.

అని నుడువుచుండ నొకచారుండు వచ్చి

చారు—మహాప్రభూ! వత్సరాజు మహామాత్యుఁ డగుసాలంకాయనునిచేఁ బట్టుకొనఁబడియెను.

మహా—(సంతసమున) నీ వేమని చెప్పితివి?

చారు—వత్సరాజు సాలంకాయనునిచేఁ బట్టుకొనఁబడియెను.

మహా—ఉదయనుఁడే?

చారు—అగును.

మహా—శతానీకునిపుత్రుఁడే?

చారు— అగును.

మహా—సహస్రానీకుని మనుమఁడే?

చారు—అగును.

మహా—యౌగంధరాయణుఁడు చనిపోయెనా?

చారు—ఆయన కౌశాంబిలో నున్నవాఁడు.

మహా—అట్లేని వత్సరాజు చిక్కలేదు.

చారు—నామాట నమ్ముఁడు.

మహా—ఎవ్వాని శౌర్యమును రణరంగములయందు వైరులు వొగడుచుందురో అట్టియుదయనుఁడు చిక్కెనని నీచె

ప్పినమాట విశ్వసింపఁ జాలను. చేతితో మందరగిరిం ద్రిప్పితి నని చెప్ప నెవ్వఁడు నమ్మును? మఱియు యౌగంధరాయణుని నీతిమర్మములు జగమున నుతికెక్కియుండ నతఁడు జీవించియుండగనే యీవీరవరుఁడు మనకు జిక్కుట యెక్కడిది?

చారు—మహారాజా! నేను బ్రాహ్మణుఁడను వృద్ధుఁడను ఇది వఱకు ననృత మాడి యెఱుంగను.

మహా—సాలంకాయనుఁ డంపినపురుషుం డెక్కడ?

చారు—జవనాశ్వములుగల యరదంబున వత్సరాజునునిచి కొని సాలంకాయనుఁడే వచ్చెను.

మహా—ఇట్లువచ్చెనా? ఔరా! ఏమి నాభాగ్యము? ఇప్పుడు మనసేనలు సన్నాహము విడిచి విశ్రమింపనీ. ఇది మొదలుకొని చారులను బ్రచ్ఛన్నముగా ననుప నక్కఱ లేక రాజులు నిర్భయముగానుందురు. ఆహా! నేటికి మహాసేనుఁడ నైతిని.

అంగా—మన మంత్రి వత్సరాజుం గొని వచ్చెనా?

మహా—అగును.

అంగా—ఈతని నిమిత్తమే కదా? వాసవదత్త నింతదనుక నెవ్వనికి నీఁ దలంపకుంటిమి

మహా—సాలంకాయనుఁ డెక్కడ?

చారు—రాజద్వారంబున నున్నవాఁడు.

మహా—రాజకుమారునకుఁ జేయనగు సత్కారము వత్సరాజునకుఁ జేసి యతనితో సాలంకాయనుని లోనఁ బ్రవేశపెట్టుము. వత్సరాజుం జూడవచ్చిన పురజనులం బారఁదోలకుఁడు. ప్రసిద్ధుఁడగు నాశత్రునిం బౌరులు వీక్షింతురుగాక.

చారు—దేవరచిత్తము.

అంగా—ఏ నీరాజకులమున నెన్నియో యభ్యుదయముల ననుభవించితిగాని యింతయుత్సవము నెఱుఁగను.

మహా—వత్సరాజును బట్టు నంతటి సంతోషవిషయముగాంచి యెఱుఁగను.

అంగా—నిజముగా వత్సరాజేకదా ?

మహా—అగును.

అంగా—మనసంబంధముఁగోరి యెందఱో రాజులు దూతల నంపిరిగాని యితఁ డనిపియుండలేదు.

మహా—ఈతఁడు మహాసేనుఁడను పేరే విననొల్లఁడు. ఇఁకమన సంబంధము నెట్లు కాంక్షించును ?

అంగా—మిమ్మును లెక్కసేయఁడా?అతఁడు పిన్నవాఁడా? లేక తెలియనివాఁడా ?

మహా—పిన్నవాఁడేగాని తెలియనివాఁడుగాఁడు.

అంగా—దేనినిబట్టి యీతని కింత గరువము ?

మహా—సుప్రసిద్ధరాజర్షి నామముతో నొప్పునదియు వేదవిదితమైనదియు నగు భరతవంశ మతనికి గర్వము గలి

గించెడిని. కులక్రమాగతమైన గాంధర్వ మీతనికి నభి మానముఁ బెనిచెడిని. అభినవయావనమునకు దగిన రూపము విలాసము నొసఁగెడిని. జనానురాగము విశ్వా సమును వృద్ధిపఱచెడిని.

అంగా—కులము, రూపము, విద్య, ప్రాయము మొదలుగా నన్నియు మేలిగుణములే. ఇఁక వీనిలో నెద్ది మీకు ద్వేషకారణ మయ్యెను ?

మహా—దేవి ! అగ్గి పొదలనెల్లం గాల్చునట్లు నాశాసనము పుడమియం దెల్లెడలఁ బ్రజ్వరిల్లెడిని. గానియీతని దేశంబునఁ జెల్లదు. ఇదియె ద్వేషబీజము.

అంగా—అంతశూరుఁడా ?

కంచుకి—దేవ ! సత్కరించి వత్సరాజుతోఁగూడ సాలంకా యనుని లోనఁబ్రవేశపెట్టితిమి. వత్సరాజువీణ యిది. దీనిని మీ కిమ్మని మంత్రివర్యుఁ డనిపెను.

మహా—ఆహా ! ఇదియె ఘోషవతి. దీని బ్రయోగించునెడ నుద యనునకు మత్తగజంబులును వశపడుచుండును. పెద్ద వాఁడగు గోపాలకుఁ డర్థశాస్త్రమున నాసక్తుఁడు. చిన్న వాఁడైన యనుపాలకుఁ డన్ననో వ్యాయామపరుఁడై గాంధర్వమున ద్వేషంబును గలవాఁడు. ఈవీణ నెవ్వని కిచ్చిన నుపయోగపడును ?

అంగా—వాసవదత్త వీణ నేర్చికొనుచున్నదిగదా ?

మహా—దీనిని దానికె యిప్పింపుము.

అంగా—ఈవీణనుగూడ నిచ్చునెడ దానికి గానోన్మాద మింకను బెరుగునేమో?

మహా—ఆడుకొననిమ్ము. అత్తగారింటి కేగినపిదప నిది యంతయు సాగదు గదా?

కంచుకి—వత్సరాజునకుఁ బెద్దగాయములు దగిలియుంటచే నాయనను మధ్యమగృహమున బ్రవేశపెట్టితిమి.

మహా—గాయము లయ్యెనా? ఇప్పు డుపేక్షింప దగదు. ఉదయనుని గాయముల మాన్పింపుమని భరతరోహకునకుఁ జెప్పుము. ఇదిగాక, అతఁ డెద్దికోరిన నది సగౌరవంబుగా దీర్పుఁడు. ఆతని యింగితముం గ్రహించియె యుపచరింపుడు. కడచిన పోరాటముం గుఱించినమాట లతని యొద్ద బ్రస్తాపింపకుఁడు. తుమ్మినప్పుడు దీవింపుచుండుడు. మణిభూమికయందుఁ బ్రవేశపెట్టుడు.

కంచుకి—మహాప్రసాదము. అట్ల యొనర్తు నని యేగెను.

అంతలో భానుమంతుండు గగనమధ్యము నలంకరింప మహాసేనుఁడు మాధ్యాహ్నిక కృత్యమునకై వెడలిపోయెను.

---

## పంచమ ప్రకరణము.

### యౌగంధరాయణుని కార్యక్రమము.

---

యౌగంధరాయణుఁడు కౌశాంబీనగరమున హ్వారరక్షితుని రాజ్యకార్యనిర్వహణముననను, కటకపింగళకులను దండనాథులను రాజ్యసంరక్షణకృత్యముననను నియోగించి తానుస్మత్త

వేషమును, రుమణ్వంతుఁడు క్షపణకవేషమును, రుమణ్వంతుని తోఁబుట్టువు సాంకృత్యాయని యనుపేర యోగినీవేషమును దాల్చి యుజ్జయినిం బ్రవేశించిరి. ఇంకను బెక్కురు పెక్కువిధముల మాఱుపేరులు దాల్చి కొందఱు ద్వారపాలురుగను, మఱికొందఱు గజాశ్వాదిసంరక్షకులుగను నుండి మహాసేనుని గొల్చుచుండిరి. యౌగంధరాయణప్రేరితు లగు రాజపురుషులు కార్యనిపుణు లగుటం జేసి ప్రద్యోతుని మెప్పు వడసి యట నధికారములఁ బడయుచుండిరి. ఈవిధమున నుజ్జయినీనగరము నానాటికి వత్సదేశజనభూయిష్ఠంబయ్యెను. యౌగంధరాయణముఖ్యు లొక్క సంకేతస్థలము నేర్పఱచుకొని రాత్రులయందు గార్యాలోచనము సేయుచుఁ బవటివేళఁ దమ తమపనులు నిర్వర్తించు కొనుచుండిరి.

అట్లుండి వారు ప్రద్యోతుని పట్టపేనుఁగు నలగిరికి మదజనక వస్తువులు మిక్కుటముగాఁ బెట్టించిరి. ఆగజరాజము గిరివరము బోలియుంటనే దానికి నలగిరి యను పేరు చొప్పడియెను. మదకరవస్తుభక్షణంబున నద్దానికి నత్యధికమదంబు స్రవింపందొణంగెను. అంత దానియెదుట యౌగంధరాయణప్రేరితు లగు గూఢచారులు గొన్నిభవనంబులు గాల్చిరి. అప్పుడు మత్తదంతావళ మాభీలములగు జ్వాలనజ్జ్వాలలంగాంచి బిట్టుబెదరి కట్టుగొయ్యఁ బెకలించుకొని నగరంబుపైఁ బడి కనఁబడినమావటీంద్రను, శూలహస్తులను, యోధులనుగూడఁ జిత్రవధ సేయఁ జొచ్చెను. అత్తఱి నానగరంబు ధావమాన యోధనికరంబును, రోదమాన స్త్రీజనంబును, పలాయమాన

పురజనంబును నై యకాలప్రళయశంకాకులం బయ్యె. అప్పుడు ప్రద్యోతుం డవ్వార్త విని యేమియుందోపక నిజకాంతతో సౌధాగ్రంబుసేరి సాలంకాయనుని బిలిపించికొనునంతలో గొందఱు దాసీజనులు వచ్చి మహాప్రభూ! భర్తృదారిక దేవీ దర్శనకాంక్షతో శిబికారూఢయై తూర్పువీధి కేగియుండెను. మత్తగజంబావీధినే తిరుగుచున్నదని తెలిపెడినని విన్నవించి యాక్రోశించిరి. అంత మహాసేనుండు శోకాకులచిత్తుండై యావీధికి గొందఱు భటులంబనుప వార లటకేగి వాసవదత్తావృత్తాంతం బరసి దేవా! శ్రీమతి దేవిగోపురము నెక్కి యున్నది యని చెప్పిరి. ప్రద్యోతుఁడు సాలంకాయనుం జూచి.

ప్రద్యో—మంత్రిముఖ్యా! ఈమత్తగజోపద్రవము వారించు నుపాయ మేమి?

సాలం—దాని నాలోచింపనే తమసన్నిధికి వచ్చితిని.

మహా—అది వశముగానప్పు డేమిచేయవలయు? దానిని వధింప ధానుష్కులకు నానతిమ్ము.

సాలం—అద్ది పట్టపేనుఁగు. దేవరవారు పట్టాభిషిక్తులైనప్పుడు దాని నధిష్ఠించితిరి. పట్టపేనుఁగును జంపుట బాడిగాదు,

మహా—అయ్యది యెల్లరను జంపునప్పు డేమి చేయవలయు?

సాలం—వే రుపాయము లేనప్పుడు మీరు సెలవిచ్చినదే.

మహా—ఇపుడు దాని వశపరచుకొన నేమియుపాయము గలదు?

సాలం—వత్సరాజు గజవశీకరణవిద్య గలవాఁడని ప్రసిద్ధి కలదు. గాన నాతనిని నీపనియందు నియోగించినచోఁ జక్కఁబడునని తోఁచెడిని.

మహా—ఇపు డతనితోఁ డ్పాటు గోరుటే మనకు మానభంగక రము. దీనికి మనములోఁబడి యతనిం బ్రార్థించినను మనయెడ నాగ్రహాగస్తుఁడగు నతఁ డిప్పనికి నొడంబ డునా?

అంగా—ఒడంబడినచో ననుపవలయుననియె యెంచితిరా? అతఁడు కులరూపశీలాదులకలిమి మనకన్నియకుదగునని యెన్నుచు నీ రాకుమారుని మదపు టేనుగునకు నర్పింప జూచెద రేమి?

సాలం—ఆయన కేమియు భయములేదు. వత్సరాజు నెప్పగి దినేని నిప్పని కొప్పించెద. అనుమతించుడని రాజు నాజ్ఞ గొని సాలంకాయనుఁడు కౌశాంబీశునొద్ద కేగి యిట్లనియె.

సాలం—రాజా! మీకు సుఖమా?

వత్స—చెఱలోనున్నవానికి గలసుఖము నీమది కెట్లు తెలియును? పరిహసింపవచ్చితివా?

సాలం—కడచినదానికై వగచిన నేమిలాభము? నామాట యాలింపమినే మీ కిట్టినిర్బంధము ప్రాపించెను. ఇంక నైన నామాట పాటింతురేని మీకు దప్పక శ్రేయ ము గలిగెడిని.

వత్స—వంచకులమాట పాటింపకుండు టెట్లు ?

సాలం—కార్యావసరముంబట్టి యెట్టివారలకైన నొకప్పుడు ఛల ముపయోగింపవలసివచ్చుట రాజనీతికి విరుద్ధముగాదు. అట్లని యెల్లపు డద్దానినె యవలంబింతుమా?

వత్స—ఇపుడు మీరు చెప్పఁదలంచిన దేమి ?

సాలం—మీ రొకపని సాధింపవలసియున్నది.

వత్స—వివరింపుడు.

సాలం—నలగిరి యను గజేంద్రము మదించి యేరికి వశపడక జనులసమయించుచున్నది. గజవశీకరణ విద్యాప్రభావంబున దానిం బట్టుకొనినచో మీరు గొప్పలాభము గలిగెడిని.

వత్స—ఆవిద్యామహిమంబుననేకదా యిదివఱకు కిట్టిలాభము పొందితి. ఈలాభముఁ బెంపుసేయఁ దలంచితిరికావలయు ? వచ్చినలాభము చాలును.

సాలం—నామాట వినినచో మీ కీకష్టము వాయును.

వత్స—వినకున్న నేమి ?

సాలం—మీ కీనిర్బంధము నివర్తింపదు. అదిగాక, గజవశీకరణవిద్య తెలిసియు మీ రీమత్తగజోపద్రవము వారింపనిచో నది జనములఁ జంపుటయు విలుకాండ్రు దానిం బరిమార్చుటయు సంభవించును గాన నాహింసాదోషము మిమ్ముసంక్రమింపక మానదు.

వత్స—సాలంకాయనా ! మీరాజమంత్రులంబట్టి నాచిత్తమిప్పని నొల్లకున్నను హింసాదోషము నిర్బంధించుచున్నది. అయినను నిరాయుధుఁడ నేమిసేయుదును ?

సాలం—మీా రీకృత్యమున కొడంబడునెడ సాధనంబులకు గొఱంతయేమి ?

అనిపల్కి యామంత్రిముఖ్యుఁడు వత్సేశ్వరు సుస్నాతుని జేయించి యుజ్జ్వలవస్త్రాభరణములను ఖడ్గమును ఘోషవతినిగూడ నొసఁగఁ గ్రహించి మహీశుండు వారు సిద్ధబఱచినవారుణంబు నెక్కి సాలంకాయనాదులు వెనుక వచ్చుచుండ మత్తమాతంగం బున్నయెడకుఁ బోయి దానిం గాంచి కొంతయెడంబుననె తురంగమంబుదిగి ఘోషవతి మేళవించి మధురం బగుకంఠస్వరంబుతో నేకంబుగ వీణవాయింపఁ దొడంగెను.

ఆమదనాగంబు మధురగానంబు విని శిరము వాంచి వీనులు నిక్క బట్టుకొని భూనాథున కెదురై యాడుచుండెను. అత్తఱి పురజనంబులు విస్మయాక్రాంతచిత్తులై గజరాజనర్తనంబు నాలోచించుచుండిరి. అప్పుడు దేవీగోపురంబున నున్న వాసవదత్త యుదయనుని రూపవిభవంబుదిలకించియు, గానమాధుర్యంబు నాకర్ణించియుఁ జిత్రన్యస్తాకృతిం దలపించెను. అంత నక్కోమలి సఖురాండ్రప్రేరణంబున సచేతనయై హస్తినటనంబు గాంచి యచ్చెరు వందుచుండెను.

వత్సనరపతి కొంతతడ వగ్గజేంద్రంబు నాడించి వశపడియెనని గ్రహించి సన్నసేయ నది పండుకొనియెను. అంత మహీకాంతుం డాదంతావళంబు నధిరోహించి వెడలుదు నున్మత్తుండు తమ్మటంబు వాయించుచు నేనుంగునకు నడ్డపడుటయు గజేంద్రంబు వాని తమ్మటంబు నిజకరాగ్రంబున లాగి

యుదయనునకిడియె. భూమీశుం డాతమ్మాటంబుజూచియిచ్చిన నందుకొనిగజంబు దానిందిరుగ నున్మత్తున కొసఁగెను. ఏనుగు ముట్టినది నాకేలయని యాయున్మత్తుండు దానిం జించివైచి నిజేచ్ఛం బోయెను.

ఉదయనమహీశుండు మత్తగజారూఢుండై వేడుకదు వాసవదత్త శిబిక నధిష్ఠించి బైలుదేరెను. తోడన సాలంకాయనాదిరాజపురుషులు మహాజనంబులును జయజయశబ్దంబులతో నరుదెంచుచుండిరి. అట్లు రాజసౌధంబు ముంగిట జేరుటయు వాసవదత్తలోనఁ బ్రవేశించెను. సాలంకాయనాదులు వత్సాధీశుని సౌధాంతరంబునఁ బ్రవేశపెట్టి రాజోపచారంబులు సల్పుచుండిరి. పౌరు లెల్లరును నుదయనుమహత్వంబును నుపకార పరత్వంబును వేనోళ్ళఁ బొగడుచునీవసుధావల్లభుని వాసవదత్తకు వల్లభునిగా గూర్చినచో విధిని మెచ్చనగునని భావించుచుండిరి.

---

## షష్ఠ ప్రకరణము.

### గాంధర్వ శిక్షణము.

వత్సరాజొకనాడు తనలోనిట్లు తలపోయుందొడంగెను. ఆహా! విధివిపాకము నన్నెట్లు లాడించుచున్నది? నేనిట్టువెరి వంచనమునకు లోఁబడుదునని కలలోనైనఁ దలంపనైతిగదా? ఏ నీ విపత్సముద్రంబు నెట్లు తరింతును? మత్తగజంబుగాంచి యదియోడగా నెంచి దాని నధిరోహించి విరోధయూథంబు

జీరికింగొనక వెలువడనెంచునంతలో నాయాశయంబుగ్రహించి యప్రతిమప్రభావుండయ్యు నానేరమున నున్మత్తభూమిక నవలంబించిన యౌగంధరాయణుండు వేగిరపడకుము. ఇం కొక్క నెల నిరీక్షింపుము. నాటికిగాని మనయత్నంబులు ఫలింపవని తమ్మాటముమీద వ్రాసి కనంబఱచెను. అదిగాక, నీ కీ సూకరితో నేల? సౌవర్ణప్రతిమ నొసగెదనని పలికెను. దానింబట్టి నీకు రాజకన్యను సంఘటింపఁజేసెద. ఏనుగు నెక్కియురుకకు మనునర్థము స్ఫురించెడిని. ఏను వాసవదత్త గుణగణంబు పలునాళ్లనుండి వినుచు నాకన్నియ నెట్లు సూతు నని యెన్నుచుండ నాహతవిధి వైరివంచనామిషంబున నిటకు రప్పించి యాచంచలాక్షిని దృగ్గోచరం గావించెను. శత్రు బంధంబుల నేవిధినైన విడిలించుకొనియెగఁజాలుదుఁగాని యావి లాసవతి కటాక్షవీక్షణబంధంబులు విడిపించికొన శక్తుండగాను. ఆకన్నియ సవిలాసకృత్యంబులు సూడ వెడవింటిజోదు నాయెడఁ బ్రసన్నుండుగాఁ దోచెడిని. అయినను నాయన్నువమిన్నలభించు టెట్లు? నిజదేశంబు సేరుటెట్లు? అని చింతించుచుండెను.

అంతలో నంగారవతీప్రేరణంబున మహాసేనుండు వాసవదత్తకు వత్సరాజుచే వీణ నేరిపింప నెంచి సాలంకాయనుం గూడి యుదయనుని యొద్దకు వచ్చెను. అప్పుడు సాలంకాయనుండు వత్సమహీపతిం గాంచి యిట్లనియె.

సాలం——రాజేంద్రా! మాప్రభువు మీమైత్రిని గోరెడిని.

వత్స——అది నాకుమున్నె తెలియును. మీరు మైత్రిని గోరకున్నచో నన్నెట్లు వంచింతురు?

సాలం—భూనాథా! గతము మఱువుము.

వత్స—మీ చేసినపని యుత్తమక్షత్రజన్ముఁడు మఱచునదియే? అదిగాక మైత్రి సములకే చెల్లునుగాని అది మాకెట్లు చెల్లును?

సాలం—మీ రిర్వురు సములనియె నానమ్మిక.

వత్స—కానేర మని యె నానమ్మిక.

మహాసేను—అది యెట్లును నిజమే.

వత్స—ఎట్లో వివరింపుము.

మహాసేనుఁడు—నీవు బద్ధుండవు. నేను బంధించిన వాఁడను.

వత్స—ఈమహాకార్యమునకు నీవ సంతసపడవలయు.

మహా—ఇది మహాకార్యము గానేరదా?

వత్స—మన మిర్వురము ద్వంద్వయుద్ధంబునకు గడంగుదమా?

మహా—నేను గనుసన్నసేసినచో నిపుడు లక్షలకొలఁది సైనికులు నిన్ను జుట్టుకొందురు.

వత్స—నే నీనలగిరి నెక్కినచో నిన్ను నీయక్షౌహిణినిగూడ క్షణమాత్రమున మర్దింపగలను.

సాలం—వత్సేశ్వరా! మీసన్నిధికి నతిథులమై వచ్చినవారి యెడ నాగ్రహంబు పూనుట తగునా?

వత్స—అతిథుల కోర్కి దీర్ప సంసిద్ధుఁడను. అతిథి వచ్చి ప్రాణంబు గోరినను సుధాకరవంశ్యులు వెనుదీయరు. ఇప్పుడు అతిథి యెవ్వరు? కోరునదేమి?

సాలం—అతిథి మహాసేనుఁడు. ప్రార్థించునది విద్యోపదేశము.

వత్స—ఏ విద్య కావలయును ?

సాలం—గజాకర్షిణి గాంధర్వము ననునవి యపేక్షితములు.

వత్స—వాని నవివాహితులకే యుపదేశింపనగును.

సాలం—రాజపుత్రులు వివాహితులైనను భర్తృదారిక యపరిణీతయే. గాన నామెకు నుపదేశింపుడు.

వత్స—స్త్రీజనమునకు గజాకర్షిణి యనర్థము.

సాలం—ఆకన్నియకు గాంధర్వమునే యొసంగుడు.

వత్స—ఆపె రాకన్నియ. అందును నంకురితయౌవన. అట్టివారి సమావేశము మాకు ననుచితము.

సాలం—అది శంకాస్పదము గాకుండునట్లు యొనర్తుము.

వత్స—ఎట్లు ?

సాలం—ఈనగరమున సాంకృత్యాయని యని యొకయోగిని కలదు. ఆమెసాన్నిధ్యమున రాకన్నియకు మీరు గాంధర్వము నుపదేశించుట యేరికిని శంకాస్పదము గాదు.

వత్స—ఆయోగిని యెవ్వరు? ఆమెశీలాదు లెట్టివి ?

సాలం—ఆయోగిని హిమవన్నగప్రాంతమునుండి వచ్చియున్నది. యోగసిద్ధురాలు.

వత్స—అటులేని శంకాస్పదముకాదనియె తోంచెడిని.

నాపుడు సాలంకాయనుండు మహాసేనునితో నటనుండి వెడలి వాసవదత్తాంగారవతులతోఁగూడి సాంకృత్యాయని యున్నయెడకుఁ జనిరి. అప్పుడు మహాసేనుండు నమస్కరించి యోగినితో నిట్లనియె.

మహా—యోగినీతిలకమా! మీతపంబు నిర్విఘ్నంబుగ సాగెడినా?

సాంకృ—ప్రభువులవారియనుగ్రహంబు గలుగ మా నియమాదులకు విఘాతం బెట్లు గలుగును?

మహా—అమ్మా! మిమ్మిపు డొకపని యర్థింపవచ్చితిమి.

సాంకృ—ఆనతిండు.

మహా—ఈకన్నియకు గానవిద్యయందు నాసక్తి యధికము. వత్సరాజుచే వీణ నేర్పింపఁదలంచితిమి. అతఁడు మాభవనమునకు రానొల్లఁడు. అశంకితమగుప్రదేశము కుదురదయ్యెను. వత్సరా జెట్టకేలకు మీసాన్నిధ్యము నంగీకరించెను. ఇప్పని నొడఁగూర్ప వేడుచున్నారము.

సాంకృ—రాజా! మహాకాళేశ్వరుదర్శనంబు గోరి యిట వసింపవలసె. మాకు జనసమ్మర్దం బె యనర్థము. అందును యువజనసన్నివేశము. గానగోష్ఠియు నిషిద్ధములు. ఏమి సేయను దోఁపకున్నది.

మహా—మీరు జగమును దరింపఁజేయ నెంచి యవతరించిన కారణజన్ములు. మీసన్నివేశమున మాబోటిప్రాకృతుల మనంబులును నిర్మలంబు లగుచుండ నితరజనసన్నివేశము సిద్ధజనుల కెట్లు చిత్తవిక్షేపకర మగును? కావున మాప్రార్థనం బంగీకరించి మమ్ముఁ గృతార్థులఁ జేయుము.

అని వేడిన నాజోగిని నమ్మతించెను. అంత మహాసేనుండు వత్సరాజు నటకు రప్పించి వాసవదత్త నగ్నిసాక్షికముగ నత

నికి నంతేవాసినిగా నర్పించెను. వాసవదత్తావత్సరాజులదియెవివాహామనిదమలో భావించిరి. అదిమొదలుకొనివాసవదత్త వత్సరాజు వలన ఘోషవతిని వాయింప నేర్చికొనుచుండెను. కులము, రూపము, జవ్వనము, శీలము, కలాకౌశలము నన్నిట నీయిర్వురు ననుగుణమున నున్నవారు. మఱియుఁ బరస్పరానురాగభరితులు. అట్టివారిశిక్షణాగ్రహణంబులు వర్ణింప నెవ్వరితరము? వారిద్దఱకు గ్రమంబుగ రాగవిభవంబుతో ననురాగవిభవంబును బరిపూర్ణం బగుచుండెను.

---

## స ప్త మ ప్ర క ర ణ ము

### వా స వ ద త్తా ప హ ర ణ ము.

---

అంతఁ గతిపయదినంబులకు రుమణ్వంతుఁడు సేనాసముదయమును సన్నద్ధముసేసి సీమాంతములయందు నిలిపెను. దానం జేసి, మనపనులన్నియు సమగ్రము లయ్యెను. ఇఁక నీనగరము వెల్వడనగునని యౌగంధరాయణుఁడు వత్సరాజునకుఁ దెలిపెను. దానింబట్టి యుదయనుండు గమనోన్ముఖుండై యోగినికి నావృత్తాంతము సూచింప నామెవలన పిడుగుంబోని యవ్వార్త వినగనే వాసవదత్త మూర్ఛితయై కాంచనమాల సేదదేర్పఁ గొంతతడవునకు దెలివినొందెను. అప్పుడు కాంచనమాల యిట్లనియె.

కాంచ—సఖీ! ఏల యిట్లున్నదానవు?

వాస—నీకు నాయెడ నేమివిశేషము గాననయ్యెను?

కాంచ—ఇప్పుడు స్మృతిదప్పితివిగదా?

వాస—నావస్తుజాతము నెల్ల నీ వుపయోగించికొనుము.

కాంచ—ఇంతసాహసము నవలంబింప నేల?

వాస—ఏ నేమిసాహసము నవలంబించితిని?

కాంచ—ఉసురులు పీడ నెంచుటకన్న సాహస మేమికలదు?

వాస—ఏనేమియు నెఱుఁగ. నన్నుఁ బలుకరింపకుము.

నాపుడు కాంచనమాల సేయునదిలేక యీయుదంతంబు యోగిని కెఱిఁగింపఁ నామె యిది యుదయనుని ప్రయాణమూలమున సంభవించిన మనోవేదన యని గ్రహించి కాంచనమాలతో నిట్లనియె. మదవతీ! ఉదయనుని ప్రయాణోదంతము వాసవదత్తకుఁ దెలిసెనుగాన నీపరితాపము నకు నదియె కారణమని తోఁచెడిని. ఈ రాత్రి పయనము సిద్ధమని వత్సరాజు నాకుఁ దెలిపెను. ఈవిలాసిని యాసర సునితో నేగుటకు సమ్మతించు నెడ నతనికిఁ జెప్పి యొప్పింతును. కాన నీవు వాసవదత్త నూఱడింపుము. నావిని కాంచనమాల వాసవదత్త నుపలక్షించి.

కాంచ—సఖీ! నీసంతాపమునకు గారణమెద్దియో చెప్పుము.

వాసవ—నాకు సంతాపమె లేదు.

కాంచ—నీమాటంబట్టి నీకు నాయెడఁ జెలికారంబు కపటంబని తోఁచెడిని.

వాసవ—ఏకారణమున?

కాంచన—సౌహార్దంబు గలదేనినాకునిజంబేలవక్కాణింపవు?

వాసవ—నాకు నాయఃసువులె శత్రువులు. వీనిం బరిత్యజించి సుఖింతును. ఇదియ నిజము.

కాంచ—నీకు నీప్రాణములె సంతాపకరములుగాఁ దోప నేమి కారణము? ఉదయనవియోగము భరింపఁజాలవేని యాసుభగునితో నరుగుము.

వాసవ—తలిదండ్రులయనుజ్ఞ నొందక యట్లు వోవుట ధర్మ విరుద్ధము గాదా?

కాంచన—క్షత్రజాతికన్యలకు స్వయంవరము విహితమై యుండ నీ వీసుందరుని వరించి యితనితో నేగుట యధర్మ మెట్లగును?

వాసవ—ఇది ధర్మ్యమే యైనను తలిదండ్రుల యనుమతి వడయక ప్రియుని వెంబడించి యేగుట యపఖ్యాతికర ము గాదా?

కాంచన—ప్రియుని వెంబడి యేగుట యపకీర్తికర మెట్లగు?

వాసవ—ఇందు దోషము లేకున్నను వత్సరాజు ప్రద్యోతుని ప్రియపుత్రిక నపహరించెనని లోకులు చెప్పికొనుచుం దురుగాన నాతలిదండ్రుల మానభంగమున కెట్లుసమ్మ తింతును?

కాంచన—ఈమూలమున మీజనకునకు మానహాని సంభావిత మైనను నీ కిది యవశ్యకర్తవ్యమే యగు.

ఏలన, ఉదయనమహాసేనులకుఁ బూర్వవిరోధము కలిగి యున్నకతనమీతండ్రియుదయనునిఁ బ్రార్థించుటగాని, తన్మా

లమున నతఁడు నిన్నుఁ బరిగ్రహించుటగాని సంభవింపదు. దానం జేసి యిప్పుడు వత్సరాజుతో నరుగుటయ శ్రేయమని బోధించి వాసవదత్త నొడంబఱచి యావృత్తాంతము యోగినీ ముఖమున నుదయనునకుఁ దెలుప నాయన యనుమతించెను.

అంత నారాత్రి వత్సమహీనాథుండు వాసవదత్తాకాంచనమాలలతో భద్రవతియను ధేనుక నధిష్ఠించి వెడలెను. అప్పుడందున్న పురరక్షకులు మున్నగువారిలో బెక్కురు యౌగంధరాయణుని గూఢప్రణిధులే యగుటం జేసిబహిర్ద్వారంబుదనుక నుదయనునిపయనంబు నిర్నిరోధంబె యాయెను. పురద్వారమున నున్నవీరభటులు కౌశాంబీనాథు నడ్డగింప వారిని శరసంధానంబునం గూల్చి యుదయనుండు భద్రవతిని నడిపించుచుండెను. హతశేషులగు వీరభటులప్రేరణంబున మహాసేనునిసేనలు వత్సేశుని వెంబడింప యౌగంధరాయణుండు ఖడ్గహస్తుండై యాసేన నొక్కింతతడవు నిలిపెను. అంతలో వత్సరాజు సీమాంతము నతిక్రమించి నిజసైన్యంబుం గలిసికొని కౌశాంబీనగరప్రాంతంబుననున్నలావాణకంబను రమ్యహర్మ్యంబుఁ బ్రవేశించెను.

---

## అష్టమ ప్రకరణము.

### యౌగంధరాయణ సమ్మాననము.

---

ఉజ్జయినీనగరమున నానాఁటిప్రభాతమున గొప్పకలకలము వినవచ్చెను. అప్పుడు సేవకులు తమలో నిట్లు సంభాషింపఁదొడంగిరి.

ప్రథముఁడు—ఈరణగుణధ్వని యేమి ?
ద్వితీయుఁడు—వత్సరాజు వాసవదత్త నపహరించికొనిపో యెను.
ప్రథము—వారి కెవ్వరు నడ్డపడలేదా ?
ద్వితీ—వారిని సేనయంతయు వెనుదవిలెను.
ప్రథము—అప్పు డేమయ్యెను ?
ద్వితీ—ఒక్క మహాపురుషుఁడు ఖడ్గహస్తుఁడై యడ్డగించెను. అంతలో వారు యథేచ్ఛం జనిరి.
ప్రథ—ఆపురుషుఁ డెవ్వఁడు ?
ద్వితీ—ఇంతదనుక నీనగరమున నున్మత్తవేషమునఁ దిరుగుచున్న యౌగంధరాయణుఁడె.
ప్రథ—ఏమి యీచిత్రము. ప్రాకారము, పురద్వారము దక్క యీనగర మంతయు కౌశాంబిగానె యున్నది. తరువాత నేమయ్యెను ?
ద్వితీ—యౌగంధరాయణుఁడు పట్టువడియెను.
ప్రథ—ఏమికారణము ?
ద్వితీ—ఆమహామాత్యుఁడు సేనావేగము నాపగలిగెను. గాని యింతలో విజయసుందరమను గజంబుదంతము దవిలి యాధీరునిచేతిని స్త్రింశము భగ్న మయ్యెను. దానంజేసి యామంత్రివరుండు చిక్కెను.

అనిచెప్పుచుండ యౌగంధరాయణునిఁ జేతులు గట్టి కొందఱు భటులు గొనిపోవుచుండిరి. అప్పుడు యౌగంధరా

యణుఁడు తనలో శత్రువశముననున్న వత్సరాజును బంధవిము క్తుని గావించి యాయుధ దోషంబునఁ బట్టువడినను స్వామి దుఃఖము వాపితి గానఁ జయించితి ననియె వైరిజనంబులోనికి నిర్విచారంబుగఁ బ్రవేశించు చున్నాఁడ నని తలంచుచు జనులం గాంచి.

మహాజనంబులారా! భార్యారహితునకు వనవాసము దుఃఖకరము గాదు. కోరిక తీర్చుకొనినవానికిఁ గష్టంబు నని ష్టంబు గాదు. ధర్మము నార్జించినవానికి మరణంబును శోక కారణంబు గాదు.

ఏను విరోధము భయము అవమానముగూడ లెక్కింపక నయములను వినయములను శస్త్రములను యోజించి శత్రుని జయలక్ష్మిని మిత్రులయుపకీర్తినిఁ దొలగించి జయమును రాజును కీర్తిని నార్జింపఁ గంటిని.

రాజపురుషులారా! రాజభక్తివ్రతమున విపత్తినొందిన నన్నుం గాంచుడు.

అమాత్యపదకాంక్షులారా! నాకీర్తిలాభము లెక్కించి యభిలావను స్థిరపఱచుకొందురో? నాక్లేశముం దలంచి భయమొంది యీకోర్కి వీడుదురో యోజించుకొనుఁడు. అనినుడువుచుండ భటుం డిట్లనియె.

భటుఁడు.—ఆర్యా! మిమ్ము నాయుధాగారమున నుంచుమని మంత్రిగారానతిచ్చిరి. అచ్చటఁ బెక్కండ్రు గావలివార లుందురు, అచ్చటికి రండు.

యౌగం.—ఈమాట యెంతో నగవు గలిగించెడిని. ఏలన, వత్సరా జనునగ్నిని బంధించి యునిచిన కాలమున మీా మంత్రులకు జాగరూకత యుండవలసెను. అప్పుడు నిద్రించిరి. రత్నము పోయినవెనుక పేటికయెడ వారు చాల మెలకువతో నుండిరిగదా?

భటు.—అయ్యా! ఇదె ఆయుధాగారము. ఇం దుండుము.

యౌగం.—అటులె యిందు విశ్రమింతును. భరతరోహకుఁడు నన్నుఁ జూడ రాఁగలఁడు. ఏను వాని జూడఁగోరుదు ఏలన.

అతఁడు సమానపదముననుండి కపటోపాయములు పన్ని యు నాచేసినవంచనకు లోఁబడి మల్లయుద్ధమున నోడి లజ్జచే దలవంచుకొనిన ప్రతిమల్లునివోలె నుండుంగదా? అని పలుకు చుండునంత భరతరోహకుఁడు యౌగంధరాయణునిఁ జూడ నేతెంచుచు తనలో నిట్లు తలంచెను. వంచనములచే దనపని నెగ్గించుకొని రాజునిమిత్తమున విపత్తినొంది సరోష మగు నాశీవిషంబువోలె నుండుయౌగంధరాయణుని నెట్లుఁ గాంతును? అని తలపోయుచు వచ్చి.

భరత.—ఆర్యా! యౌగంధరాయణుండను నామాత్రముల వినుచుంటిని. భాగ్యవశమున నేటికి మీాదర్శనము లభించెను.

యౌగం.—మీాదర్శనంబును మాకు నట్లే లభించెను. కానివీర వ్రతము నవలంబించి రక్తసిక్తాంగుండనై ధృష్టద్యు

మ్ముని జంపి శాంతి నొందిన యశ్వత్థామవోలె నున్న నన్నుఁ బాగుగా జూడుము.

భరత—కపటోపాయములచే వత్సరాజు నసిపి యిదియొకశూరకృత్యముగా భావించుచున్నారా ?

యౌగం—నీ చేసినది శూరకృత్యమే ? మల్లెతీవ యల్లినమద్దిచెట్టునొద్ద కృత్రిమగజంబు నిర్మించి రాజును వంచించితివి. నాకును నీదారినె రావలసె.

భరత—యౌగంధరాయణ ! మీరాజు మహాసేనుకూఁతు నగ్నిసాక్షిగ శిష్యురాలినిగాఁ బరిగ్రహించి వీరియ్యని దే యక్కన్నియను దస్కరవృత్తితో గొనిపోవుట యుచిత మగునా ?

యౌగం—నీ విట్లనుట యుచితముగాదు. అపు డగ్నిసాక్షికముగాఁ జరిగినది వివాహమనియె వారిరువురు భావించిరి. అట్లుగానిచో వత్సరా జాయన్నువ నెట్లుగొనిపోవును ? అప్పని కాయతివ యెట్లు సమ్మతించును ?

భరత—మహాసేనుఁడు వత్సరాజును బంధనరహితుం జేసి సత్కరించియుండ వత్సరాజు వాసవదత్తనుఁ బ్రచ్ఛన్నముగా గొనిపోయి మహాసేను నవమానపఱుచు టుచితమా ?

యౌగం—నీ విట్లనుట పాడి గాదు. ఏలన ? అయ్యెడ వత్సరాజును బంధవిముక్తుని గావింపకున్న చో నలగిరి తమవారి నెల్లరను వధించియుండును. అట్లు మీరాజు స్వలాభ

ముగోరి యుదయనుని బంధనములఁ దొలగించెగాని నతని సత్కరించుతలంపునం గాదుగదా ?

భరత—అటులేని నప్పని కాగనే యతనినేల తిరుగా బంధింపఁ డయ్యెను ?

యౌగం—అట్లు నలగిరినివశపఱచుకొని తమనెల్లర రక్షించి నవాని బంధించునెడ కృతఘ్నుఁ డనిలోకులెల్లరు తన్ను గర్హింతురని వెఱచి యట్లు సేయఁడయ్యెను.

భరత—అది యుండనిమ్ము. సంగ్రామమునఁ బట్టువడినశత్రుని నేమిసేయు మని శాస్త్రము చెప్పెను.

యౌగం—వధింపు మని చెప్పెను ?

భరత—వధార్హుఁ డగువత్సరాజును గాచినది దేనికి ?

యౌగం—అద్దాననేగదా ? యుదయనుఁడు మహాసేనునిశరీర మపహరింపఁ డయ్యెను.

భరత—ఇదియు శక్యమనియె భావించుచుంటిరా ?

యౌగం—సంశయ మేమి ? ఏనుఁగు మీఁది కెక్కక యటను న్నపతాకం బడఁద్రోయ నెట్లు శక్యమగు ? మహాసేనుఁడు వశపడకయున్న నాతనికూఁతు నపహరింప నగునే ? కాన ధార్మికుఁ డగు వత్సరాజు నిజహస్తంగతుండైన మీరాజును రక్షించెనని నమ్మెము.

భరత—కానిమ్ము. మహాసేనునకు నపకృతి యొనర్చి యీమేని తోఁ గౌశాంబి సేరుదునని యెన్నుచుంటివా ?

యౌగం—ఓహో! నీమాట యెంతనగుబాటుగానున్నది? చెట్టు పెకలించినవానికిఁ గొమ్మలు విఱుచుట యెంత పని? నాచే నపకృతులై నన్నప్పుడ చంపనెంచు మీ యెదుటకు జంకకవచ్చిననాకుఁ గౌశాంబి సేరుట గష్టమగునే? అనిపలుకుచుండ నొకకంచుకి వచ్చి యౌగంధరాయణునితో నిట్లనియె.

మంత్రీశ్వరా! స్వామిని రక్షింపనెంచియు శత్రుమాయనుజయింప యోజించియు, స్వీయాపయశంబు మాపుకొన దలంచియు స్వామికోర్కి దీర్ప నూహించియు నీవు మాయెడఁబెక్కుఛలంబులఁ బన్నితివిగాని మాయందు ద్వేషంబున గాదు. గుణంబులయందు వైరం బెవ్వని కుండును? నీసామర్థ్యంబునకు మెచ్చితిమి. మాసేయుబహుమానంబు గ్రహింపుమని మహాసేనమహీపతి సువర్ణాభరణంబులం బనిచెనని యొసంగ వానింగ్రహించి యౌగంధరాయణ మహామాత్యుండు తనలో నిట్లుతలంచెను.

ఆహా! ఏనెంత నిందార్హుఁడను. నలగిరియను నేనుంగునకు భీతిబుట్టింప నెంచి యేనిప్పువెట్టం గాలుచున్న గేహంబులు మంత్రివరుల డెందంబులతో నింతకును జల్లాఱ వయ్యెను. దండార్హుండ నగునాకు మహాసేనుండు బహుమానంబుసేసెను. తప్పు సేసినవానిని సత్కరించుట వధించుటయ యగుగదా? అని తలపోయుచుండ రాజసౌధాగ్రంబునుండి హాహాకారంబు వినంబడియెను.

అది యేమని విచారింప నటనుండి యొకప్రతీహారివచ్చి భరతరోహకు నుద్దేశించి ఆర్యా! అంగారవతి శోకాతిశయం బున నసువులబరిత్యజింప నెంచి మేడమీాదనుండిపడఁబోయెను. అప్పుడు దాసీజనంబులు హాహాకారంబులు సేయుచు నామెం బట్టుకొనిరి. అంతమహారాజువారరుదెంచి దేవి! నీకూఁతునకు క్షత్రధర్మముతో వివాహము జరిగెను. సంతసపడందగిన కాల మున సంతాప మొందెదవేల? ఇప్పుడు చిత్రఫలకములమీాద నున్నవాసవదత్తావత్సరాజులకు వివాహము జరిగింత మనిచెప్పి యౌగంధరాయణునిఁ దోడ్కొని మిమ్మటకు నేతేర నాన తిచ్చిరి. అనితెలుప భరతరోహకుండు వత్సరాజామాత్యునితో రాజసౌధంబునకుం జనియెను.

అప్పుడు ప్రద్యోతుండు మంత్రులతోఁగూడి చిత్రఫలకం బులకు మహావిభవంబున వివాహంబు గావించి కూఁతునకు నల్లునకును జేర్పుమని వసనాభరణ వాహన దాసీదాసాదికము ననంతముగా భరతరోహకునకు నొసంగి యాయనను యౌగం ధరాయణునితోఁ గౌశాంబికినని చెను. యౌగంధరాయణుం డిట్లు మహావిభవంబుతో నిజనగరంబుఁజేరి యుదయనునిం దర్శింప నారాజేంద్రుండు యౌగంధరాయణునిం బహుభం గులఁ బ్రస్తుతించెను. ఆమహామాత్యుని నెల్లజనులును ప్రశం సించిరి. వత్సరాజమహాసేనుం డనిచినవసనాభరణంబులం గ్ర హించి భరతరోహకుని సత్కరించి యనిపి పెద్దకాలము వాస వదత్తతో సకలసుఖముల ననుభవించెను.

---

శ్రీరస్తు

# చాణక్యుడు

---

## ప్రథమ ప్రకరణము.

### నందకుల విధ్వంసనము

---

కలియుగము నాదియందు నందవంశపురాజులు పాటలిపుత్ర మనునగరము రాజధాని గావించికొని పుడమిం బాలించుచుండిరి. వారిరాజధాని పాటలీకుసుమపురమను ప్రధాననామముగలదియగుటం జేసి యదిపాటలిపుత్రమనియు కుసుమపురమనియు నుడువంబడుచుండును. ఆవంశమునందు సుప్రసిద్ధపరాక్రమశాలి యగుసర్వార్థసిద్ధి యనురాజు నవకోటిశతసంఖ్యము లగుధనములకు నధిపతియై చిరకాలము ప్రజల నేలుచుండెను. ఆనరేశ్వరునకు వక్రనాసుఁడు మొదలగుబ్రాహ్మణులు కులక్రమాగతులైన యమాత్యులుగా నుండిరి. వారిలో దండనీతి బాగుగ దెలిసినవాఁడును పవిత్రుండు నతిశూరుండు నగురాక్షసుం డనువిప్రుండు నందరాజులకు మాన్యుండై రాజ్యభారము వహించుచుండెను.

సర్వార్థసిద్ధికి సునంద యనురాజపుత్రి జ్యేష్ఠభార్యయు శూద్రకన్య యగుముర యనునది కనిష్ఠపత్నియు నై యుండిరి. వీరిలో సౌశీల్యము లావణ్యము మున్నగుగుణములకలిమిం జేసి చిన్నభార్యయెడ రాజునకు నెక్కుడు ప్రేమ గలిగియుండెను.

ఆరాజేంద్రుఁ డొకప్పుడు తనగేహమునకు నతిథిగా వచ్చినయొకతపోనిధిని సపత్నీకుఁడై యర్ఘ్యాదివిధులతోఁ బూజించుచు నమ్మునిపాదోదకమును భార్యలశిరంబులమీఁదఁ జల్లగా జ్యేష్ఠభార్యశిరమునఁ దొమ్మిదియు గనిష్ఠభార్యశిరమున నొక్కటియు జలబిందువులు పడియెను. అప్పుడు కనిష్ఠపత్ని యాజలబిందువు నొక్కదానిని తలవాంచి యత్యాదరముతో గ్రహించెను అది గాంచి యమ్మునీంద్రుం డానాతి నధికంబుగ ననుగ్రహించెను. అంత వృషలకన్య యగునామురాభిధాన యధికగుణయుక్తుఁ డగుమౌర్యుఁ డనుకుమారుంగనియెను. జ్యేష్ఠపత్ని యగుసునంద బహుగర్భంబులు గలమాంసపేశిం బ్రసవించెను. ఆమాంసపుతిత్తియందుఁ దొమ్మిదిగర్భశకలంబు లుండెను.

రాక్షసుండు వానిని నూనెతొట్లలో నునిచి పోషింప నాశకలంబులు తొమ్మండుగురు వీరకుమారులైరి. వారల నామంత్రీంద్రుండు పెనిచెను. వీరు నవనందులని చెప్పంబడుచుండిరి. ఈరాజకుమారులు విద్యాశాలురై యౌవనంబు వొందగనె సర్వార్థసిద్ధి రాజ్యంబు వారలయం దునిచి మౌర్యుని సేనాపతిని గావించి తాను శమసుఖం బనుభవించుచుండెను.

అంత మౌర్యునకు నూర్వురు కుమారులు గలిగిరి. వారిలోఁ జంద్రగుప్తుఁడు గనిష్ఠుఁడు. వీరందఱు మహాబలవంతులై నందరాజుల నతిశయించి యుండిరి. అప్పుడు సింహళదేశపు రాజు తేనెమైనముతోఁ జేయఁబడి జీవించియున్నదియవోలె నుండునొకసింహమును పంజరమున నునిచి దానివాకిలి తెఱువ

కయ లోనిసింగమును వెలువరింపఁగల బుద్ధికుశలుఁడు మీలో నెవ్వఁడేని గలఁడాయని యనుప నానందు లందఱు నేమియుఁ దోపక మిన్నకుండిరి. అపుడు ధీమంతుఁ డగు చంద్రగుప్తుఁ డీ నుపకాడ నెఱ్ఱఁగ గాల్చి బోనున నున్నసింగమును ద్రవింపఁ జేసెను. అదిగాంచి యెల్లరు నచ్చెరు వందిరి.

దుష్టచిత్తు లగునవనందులు మౌర్యుని ప్రాబల్యమును జూడనోపక యొకభూమిగృహము గట్టించి యాలోచింపఁదగు రాజకార్య మొండు గలదని చెప్పి సపుత్రకుఁడగు మౌర్యు నటకు రప్పించి చంపించిరి. చంద్రగుప్తునకు వెఱచి యతఁడు లేనియదనున నందు లీఘోరకృత్యంబు గావించుటచే దైవయోగంబున నాతఁడుమాత్రము శేషించెను. ఈమౌర్యకుమారుం డాజానుబాహుండై శౌర్యము-ఔదార్యము గాంభీర్యము మున్నగుగుణరత్నంబులకు రత్నాకరుండై యుండెను. అయినను దుష్టు లగునానందులు చంద్రగుప్తునెడ నసూయఁబూని యెప్పుడో వధింపవలయునను తలంపుతోన యుండి యాతని నన్నసత్రాధికారమున నియోగించిరి.

మౌర్యాత్మజుండు కాలవశమున నట్లుయుండి నందుల యెడఁ బగఁదీర్చుకొననెంచి సమయము నిరీక్షించుచుండ నాతనికి నొకనాఁ డొక్క భూసురుండు పురంబువెలుపటఁ గనంబడియెను. ఆవిప్రుండు వచ్చుచుఁ దనకాలికి దర్భాంకురము గ్రుచ్చుకొనుటంజేసి దానిపై నలిగి యద్దానిని సమూలంబుగాఁద్రివ్వి కాల్చుచుండెను.

చంద్రగుప్తుం డతిక్రోధనుం డగు నాయగ్రకులజు నవలోకించి యాతండు నందుల నిర్మూలనంబు సేయంజాలునని యూహించి శరణుజొచ్చెను. విష్ణుగుప్తుం డను నాబ్రాహ్మణకుమారుండు బాలుండయ్యు శుక్రనిర్మిత మగుదండనీతియందును జ్యోతిషమునందును సమగ్రపాండితి గలవాఁడు. ఈమేధావి నీతి శాస్త్రకర్త యగుచణకాచార్యునకుఁ బుత్రుఁడు. దానం జేసి చాణక్యుండని పిలువంబడుచుండెను. సర్వవిదుండును, శ్రోత్రియుండు నగు నాబ్రహ్మచారి గుణాఢ్యుం డగు చంద్రగుప్తునందు నాశ్రయపక్షపాతంబు వహించి నీయిష్టం బెద్దియేనిఁ దీర్తుఁ దెలుపుమని యడుగ నామౌర్యతనయుండు నవనందులు సేసిన దుర్ణయము విన్నవించెను. అప్పు డాప్రజ్ఞానిధి విచారింపకుము. నందరాజ్యంబు నీయధీనంబు సేయుదు. అట్లు సేయజాలనేని యేను చాణక్యుండఁగానని ప్రతిన సేసెను.

తరువాత నాచణకనందనుం డాకలిగొని నందరాజుల భోజనశాల కేగి యందు నగ్రాసనమున గూర్చుండి యుండెను. అంత నందరాజు లరుదెంచి యాబ్రహ్మచారిం గాంచి యాగ్రహించి 'వలదని మంత్రు లందఱు వారించుచున్నను గాలోపహతచిత్తులై వడుగునకు నగ్రాసనంబు వలయునే' యని యధిక్షేపించుచు నామొంటి జందెమువాని నటనుండి యీడ్చిరి.

అప్పుడు విష్ణుగుప్తుండు రోషాంధుండై భోజనశాల నడుమ నిలువంబడి సిగముడి సడల్చి కనుల నిప్పులుప్రాల గాంచుచు 'దుర్బుద్ధులును మదాంధులునై నన్ను నవమానిం

చిననందాదులను నిర్మూలముసేయక యీసిగ ముడివేయ నని ఘోరప్రతిజ్ఞ సేసి యప్పుడ యప్పురినుండివెడలిపోయెను. ఆనందరాజు లభాగ్యు లవుటం జేసి యుద్ధతులై క్రుద్ధుఁ డగు నాజన్నిగట్టును శాంతిపఱుపరైరి. అంత చంద్రగుప్తుండు నందు లకు వెఱచి పురంబువిడిచి పఱచి చాణక్యు నాశ్రయించెను.

చణకతనూజుండు చంద్రగుప్తునిఁ జేర్చికొని పాపబహుళం బగునిక్కలికాలంబునఁ గుటిలనీతియె కార్యసాధకం బని యూహించి దాని నవలంబించి నందకులము నుచ్ఛేదింపం గడంగెను. ఆకోపనుండు తనకు మిత్రుండును నాభిచారికకృత్యవిదుండునగు నిందుశర్మయనువిప్రుని క్షపణవేషమున నునిపి వానిచే రాక్షసుఁడు మున్నగు మంత్రులను వంచించెను.

నందరాజ్యమున నర్ధాంశము నీకొసఁగుదుమని చెప్పి బలవంతుఁ డగుపర్వతేంద్రునిఁ బ్రోత్సహించి మ్లేచ్ఛబలములచే పాటలీపుత్రమునునందరాజధాని నరికట్టించెను. అపుడు గర్వితులగునందులు మంత్రులమాట విననొల్లక రణోన్ముఖులై పర్వతేంద్రబలం బనుజంఝూనిలంబునం బ్రజ్వరిల్లుచాణక్యుని క్రోధానలంబున మిడుతలై మడిసిరి.

అంత రాక్షసుండు నందవంశంబున భక్తిగలవాఁ డగుటను మ్లేచ్ఛబలము చంద్రగుప్తునిచేఁ బ్రోత్సాహితమని తెలియుటను మౌర్యపుత్రునెడ లోన ద్వేషంబువూనియుఁ బైన మిత్రభావమునె కనంబఱచుచు, చంద్రగుప్తవధ పూర్వకంబుగా వృద్ధరాజునకె రాజ్యంబు నెందఁజేయ నెంచి కొటిల్యుండు సర్వార్థసిద్ధి కేమి యనర్థంబు సేయునో యనిశంకించి

సురంగద్వారంబున వృద్ధరాజును వనమున కనిపి మౌర్య పుత్రుని సాధింపనెంచి పర్వతేంద్రునితో సంధి గావించు చుండెను.

చాణక్యుండు చారులవలన సర్వార్థసిద్ధియుదంతంబు విని యాతనిం జంపించెను. రాక్షసుం డవ్వార్తవిని నందవం శంబు నిర్మూలంబగుటకు శోకించి పురంబువెడలి గ్రామాంత రంబున వసించి యెట్లేని మౌర్యపుత్రుం బరిమార్చి స్వర్గ వాసు లైననందరాజులకు హితముసేయుదునని యోజించి యాభిచారిక విధులవలన విషకన్యం గలిగించి యద్దానిం జంద్ర గుప్తునిపైఁ బఱపుమని తనకుమిత్రుం డైన క్షపణకునిచే నని పెను. జీవసిద్ధియను నాక్షపణకుండు చాణక్యునకు నాంతరం గికమిత్రుండగుటచే నాతనివలన విష్ణుగుప్తుం డామర్మంబు గ్రహించి వానిచే నద్దానిని పర్వతేంద్రునిపైఁ బఱపించెను. అట్లు విషకన్యా ప్రయోగంబునఁ బర్వతేశ్వరుండు నిహతుం డగుటచేఁ దనరాజ్యంబున నాతని కీఁదగినయర్ధాంశంబు కొద వఁబడమిం జేసి రాక్షసోద్యమంబు చంద్రగుప్తునకు హితకరంబె యాయెను.

ఇట్లు తనయుద్యమంబు విఫలంబైనను నుపేక్షింప నోల్లక రాక్షసుండు పర్వతేంద్రపుత్రుఁ డగుమలయకేతు నుద్దేశించి 'మీతండ్రికి తన రాజ్యమున నర్ధాంశమీవలసివచ్చు నని యదితప్పించుకొననెంచి చంద్రగుప్తుఁడు చాణక్యునిచేఁ బర్వతేంద్రునిమీఁద విషకన్యాప్రయోగము సేయించెను. నీకు నందరాజ్యము సర్వంబు నందఁజేయుదు. చంద్రగుప్తుని

జయింప నుత్సాహి వగుము. నందులయం దనురక్తు లగు సామంతు లందఱు నీకుఁ దోడ్పడునట్లు సేసెద'నని చెప్పి యాతనితో మైత్రి సేసికొని యుండెను.

---

## ద్వితీయ ప్రకరణము.

### రాక్షసవశీకరణోద్యమము.

---

చాణక్యుండు రాక్షసోద్యమంబు నాకర్ణించి శిష్యునిం బిలిచి శార్ఙ్గరవా! ఏనుండఁగఁ జంద్రగుప్తునకు ద్రోహము సేయఁగలవాఁ డెవ్వఁడు? ఏనుగు నెత్తురుఁ జవిచూచి యెఱ్ఱనైన సింగంబు దంష్ట్ర వెఱికి నెవ్వండు గడంగును? నందకులంబునకుఁ గాలసర్పంబై క్రోధాగ్నిశిఖ దగుధూమలేఖంబోని మదీయశిఖ యింకను ముడువఁబడకుండవలయునని యెవ్వండు కోరును? నందకులకాననంబునకు ధూమకేతువై జాజ్వల్యమానం బగు నాకోపంబు ప్రతాపంబున మిడుతవోలెఁ బడను న్నమతిహీనుం డెవ్వడు?

రాక్షసుఁడు నందకులవినాశంబున రోషించి నందరాజ్యంబు సకలంబు నీకుఁ జేర్తునని మలయకేతునితో సంధి సేసికొని వాఁడు గూర్చుకొను మ్లేచ్ఛ రాజబలంబులం గూడి మౌర్యపుత్త్రునిపై దాడి వెడల నున్నాఁడని తెలిసెను. అయిన నేమి? నందవంశము గూల్తునని బహిరంగముగ బ్రతినసేసి నిర్వహించికొనిన యేను నీయుపద్రవము దొలఁగింపఁ జాలకుందునె?

నన్ను నగ్రాసనమునుండి లాగుచుండ గాంచినమంత్రు లిప్పుడు పర్వతశిఖరంబునుండి గజేంద్రునింబలె సాన్వయం బుగఁ ద్రోయంబడిననందునిం జూచిరి. నాప్రతిన నెగ్గినను వృషలపుత్రునికై యింకను శస్త్రంబు ధరించుచుండితి.

భూదేవిహృదయరోగంబులంబలె నందులఁ ద్రొమ్మం డ్రను నిర్మూలించితి. సరసునందుఁ బద్మలతంబలె చంద్రగుప్త నందు రాజ్యలక్ష్మి నిలిపితి. ఇట్లు నిగ్రహానుగ్రహప్రవణంబగుచి త్తంబునఁ గోపఫలంబు వైరియందును ప్రేమఫలంబు మిత్రు నందును విభాగించితి. గాని రాక్షసుండు వశపడకుండునేని జంద్రగుప్తునిరాజ్యలక్ష్మి కేమిస్థైర్యము సంపాదించిన ట్లగు ?

ఔరా! రాక్షసునకు నందవంశమున నెంతభక్తి గలదు? ఆవంశమున నొక్కఁడు మిగిలియున్నను రాక్షసునిచేఁ జంద్ర గుప్తమంత్రిపదవి నంగీకరింపఁజేయ శక్యముగాదనియు చంద్ర గుప్తునెడ ద్రోహచింత మానిపింపరా దనియు నూహించి నం దవంశీయుఁడగు సర్వార్థసిద్ధి తపోవనమునకుఁ బోయినను వా నిని వెదకి చంపించితి. అయినను నతఁడు మలయకేతునిఁ జే ర్చుకొని మమ్ముఁ బరిభవింప గొప్పయత్నమె సేయుచున్నాఁ డనుచు నాకాశమువంకఁ జూచి "అమాత్యరాక్షసా! మంత్రిబృ హస్పతీ! ని న్నేమని పొగడుదును ? లోకమున జనులు ధనము గోరి యైశ్వర్యయుతుఁడగు రాజు నాశ్రయించుచుఁ దరిద్రహీ తుఁడగువానిం బరిత్యజించుచు నుందురు. కాని ప్రభువు మృతి నొందినను తొల్లిటిమేలు దలంచి ఫలాపేక్ష లేక స్వామిహి తంబు గోరి వర్తించు నినుబోలువాని నెందుంగానను.

దానవేకదా ? నిన్ను వృషలునకు మంత్రినిగాఁ జేయఁ బూని యత్నించుచున్నాఁడ. ప్రజ్ఞలేనివాఁడు-భయశీలుఁడుభక్తిగలవాఁడైనను వానితో నేమికార్యము? ప్రజ్ఞయువిక్రమంబునున్నను భక్తిలేనివానితో నేమిలాభము? అన్నియుంగలవాఁడే కార్యసాధకుండగునుగదా ? కావున నేనిప్పునికై యత్నించుచుంటిని, ఎట్లన

చంద్రగుప్తపర్వతకులలో నెవఁడు మడిసినను చాణక్యునకు నపకారము గలుగునని యెంచి రాక్షసుఁడు విషకన్యను బనుప నద్దానిచే మాకుఁ బరమమిత్రుఁడగు పర్వతకుఁడు నిహతుండయ్యెనని లోకమున జనాపవాదము పుట్టించితి. చాణక్యుడే మీజనకునిఁ జంపించెనని భయపఱచి మలయకేతుని బలాయితునిం గావించితి. అట్లుసేయనిచో రాక్షసుఁడు వేరొక ప్రబలశత్రు నాశ్రయించి వానిచేఁ జంద్రగుప్తు నంత మొందించునో యని యెంచి యట్లు సేయవలసె. నాకుఁ బరమాప్తుండగు భాగురాయణుని మలయకేతునొద్ద మిత్రభావంబు చూపుచు నాతని నాశ్రయించి యుండుమని తెల్పిమలయకేతునితోఁ బనిచితి. రాక్షసు నాశ్రయించియున్నను బర్వతకపుత్రునిఁబదంపడి ప్రజ్ఞచే నిగ్రహింపనగును. మలయ కేతు నిప్పుడే నిగ్రహింతునేని నేన వానిజనకునిఁ బరిమార్చితినని లోకము నిశ్చయించుగాన దానిచే రాక్షసునకు నీయపయశంబు గలుగక పోవుటయేగాక మదీయేప్సితంబును నెగ్గకుండును. స్వపక్షమునను పరపక్షమునను మనయెడ ననురక్తు లెవరో విరుద్ధులెవరో తెలిసికొన నెంచి బహువిధవేషభాషాభిజ్ఞు లైనగూఢచారులఁ

బెక్కురనని పిలిచిరి. కుసుమపురమున రాక్షసునకు మిత్రులెవరో యని వెదకఁబడుచున్నది. చంద్రగుప్తునకు బాల్యమిత్రులగు భద్రభటుఁడుమున్నగువారు ప్రధానపురుషులు గావింపఁబడిరి. మాకు సహాధ్యాయుఁడు పరమమిత్రుఁడు నగునిందుశర్మ క్షపణకవేషము దాల్చి రాక్షసునకు విశ్వాసపాత్రుఁడై యున్నవాఁడు. వానిచే గొప్పపని నడిపింపవలయు. కావున నాకేమిటం గొదువ లేదు. చంద్రగుప్తుఁడు మాయందె సకలరాజ్యభారము నునిచెగాన నేను జాగరూకతతో మెదలవలయు. నని తలపోయుచుండ నొకపురుషుండు యమపటంబు బట్టుకొని వాకిటఁజేరి యనుమతుండై లోనఁ బ్రవేశించెను.

చాణక్యుండు వానింజూచి పౌరులచిత్తంబు లెట్లున్నవో కనిపెట్టనెంచి యేననిపిన నిపుణకుఁడె వీఁడని గ్రహించి కూర్చుండ నియోగించి,

చాణక్యుఁడు—భద్రుఁడా! నీపని నేమిసాధించితివో తెలుపుము.

చారుఁడు—ఆర్యా! చంద్రగుప్తమహారాజునెడఁ బ్రజలకుగల వైమనస్యకారణములను మీరు దొలగింప నెల్లరు ననురాగముతోనే యున్నారు. కాని యీనగరమున ముగ్గురుపురుషులుమాత్రము మంత్రిరాక్షసునకుఁ బరమమిత్రు లగుటంజేసి దేవరవారి పరిపాలనము నొల్లకున్నారు.

చాణ—(క్రోధముతో) వారు తమజీవితము నొల్లకున్నారని చెప్పుము. వారిపేర్లు తెలియునా?

చారు—పేర్లు తెలియనివారి నెట్లు విన్నవింతును?

చాణ—తెలుపుము.

చారు—మొదట శత్రువులయెడ పక్షపాతము వహించియున్న వాఁడు జీవసిద్ధి యనుక్షపణకుఁ డొక్కఁడు.

చాణ—జీవసిద్ధి వైరులయెడ పక్షపాతముతో నున్నవాఁడా?

చారు—జీవసిద్ధియనగా రాక్షసుఁ డనిపిన విషకన్యను పర్వతేశ్వరునిమీఁదఁ బడ వేసినవాఁడు.

చాణ—(తనలో)జీవసిద్ధి మనగూఢచారుడే, (ప్రకాశముగా) కడమవాఁ డెవ్వఁడు?

చారు—లేఖకుఁ డైనశకటదాసుఁడు. రాక్షసునకుఁ బ్రియమిత్రుఁడు.

చాణ—(నవ్వుకొని తనలో) లేఖకుఁ డననెంత? స్వల్పుఁడైనను వైరి నుపేక్షింపఁగూడదని యెంచి వానియొద్ద సిద్ధార్థకుని గానలియునిచితి, (ప్రకాశముగా) మూఁడవ వానిని దెలుపుము.

చారు—మూఁడవవాఁడు రాక్షసునకు రెండవహృదయమే. వాఁ డెవఁ డనిన, రత్నవర్తకుఁ డగుచందనదాసుఁడు. రాక్షసుఁడు వీనియింటనె తనభార్యను రహస్యముగా నునిచి వెడలిపోయెను.

చాణ—రాక్షసుఁడు వానియింటఁ దనభార్య నునిచెనని యెట్లు తెలిసెను?

చారు—ఈముద్రాంగుళీయకముం జూడుడు. ఇదియె మీకీయు దంతము నంతను దెలుపును.

అనియొసఁగ చాణక్యుండు దానిందీసికొని యందున్న రాక్షసునిపేరు చదివి సంతసమొంది "యంగుళీయకము గాదు. దీనితో రాక్షసుఁడె మాచేతికి దొరకెనని యెంచి చారు నిగాంచి యిది నీకెట్లు దొరకెనో సవిస్తరముగా వినుపింపుమని యడుగవాఁ డిట్లని చెప్పెను.

మీరు నన్నుఁ బౌరులచరితము లెట్లున్నవో వెదకుమని యనుప నేను పరులయిండ్లకు నిశ్శంకముగా నేగుటకై యీ యమపటముతో నాడుచు గ్రమంబుగ చందనదాసు భవనం బునకుఁ బోయి యీయమపటముంబఱచి గీతములు పాడు చుంటిని.

అంతలో నొకగదినుండి యైదేండ్లయీడు గలచక్కని బాలుఁడు బాల్యసహజ మగుచాపల్యమున బైలువెడలెను. అపుడు చిన్నవాఁడు వెడలిపోయెనని స్త్రీజనంబునోద యాగది లోన వినంబడియెను. అంతసుకుమారాంగి యొక్కతె మోము మాత్రము వాకిటనునిచి చూచి బుడుతఁడు వచ్చుచుండగనే బెదరించి చాచినచేతితో వానిం బట్టుకొనిపోయెను. ఆత్రొందర లో నామె చేతినుండి జారి యీ యుంగరము గడప మీఁదఁబడి యెగిరివచ్చి నాదగ్గఱఁ జేరెను. దీనిమీద రాక్ష సునిపేరు గలదని గ్రహించి మీపాదమూలమునకుఁ జేర్చితిని. ఈవిధమున నిది నాకు దొరకెను. నావుడు విష్ణుగుప్తుండు, ఓయీ! అంతయు వింటిని. అచిరకాలముననె యీపరిశ్రమంబు నకుఁ దగిన ఫలంబు గందువు. పొమ్మని వానినంపి శిష్యునిం బిలిచి వానిచేఁ బత్రికను మషీభాజనమును దెప్పించి 'దీని

మీాద నేమివ్రాయుదు ? ఈ లేఖతో రాక్షసునిజయింపవలయు' నని యాలోచించుచుండ నంతలో ప్రతీహారివచ్చి ఆర్యునకు జయమగుగాక యనిపలుక నామాటవిని జయశబ్దము విన నయ్యె. జయింతునని సంతసించి ప్రతీహారిం బిలిచి నీవు వచ్చి నపని యేమి ? యనియడుగ నది యిట్లని విన్నవించెను.

అయ్యా ! మీాయాజ్ఞయైనచో పర్వతేశ్వరునకు శార లౌకికవిధి సేయింతుననియు అతఁడుధరించిన యాభరణములను బ్రాహ్మణులకు నర్పింతుననియు మహారాజుగారు విన్నవింపు మనిరి. నావిని కౌటిల్యుండు "శోణోత్తరా! నామాటగా వృష లునితో నిట్లు చెప్పుము. నీకన్నియుఁ దెలియుగాన యథేచ్ఛ ముగా నొనరింపుము. పర్వతేశ్వరుఁడు దాల్చిన యాభరణము లను యోగ్యులకే సమర్పింపవలయుగాన నేను పరీక్షించి తగు వారి ననుపుదును.

అని నుడివి ప్రతిహారిం బనిచి శిష్యునిం బిలిచి నీవు విశ్వావసుఁడు మొదలుగా నన్నదమ్ములమువ్వురం గాంచి "మీారు చంద్రగుప్తునివల్ల నాభరణంబులం బ్రతిగ్రహించి నాకు గనఁ బడుడని యేఁజెప్పితినని వారికిఁ దెలుపుమని కబురంపి పత్రిక మీాద నొకకొంత వ్రాసి సిద్ధార్థకుఁ డనువానిం బిలిపించి వానితో నిటనియె.

ఎంతటి యత్నంబున వ్రాసినను శ్రోత్రియుల హస్తాక్ష రంబు లస్పష్టంబుగనే యుండును. గాన "ఒకానొకఁ డొకా నికి వ్రాయునట్లు స్వంతముగఁ జదువుకొనవలయునని పేర్లులేని యీ లేఖను శకటదాసునిచే వ్రాయించికొని రమ్ము. నేనిట్లు

వ్రాయుమని చెప్పితినని వానికిఁ జెప్పుము. నావిని యతఁడు శకటదాసునిచే నట్లు వ్రాయించి యాలేఖ నియ్యగా దాని మీఁద రాక్షసునిముద్రాంగుళీయముచే ముద్ర వేయించి మలయకేతుని జయించితినని సంతసించెను.

తరువాత "కౌటిల్యుండు సిద్ధార్థకునిఁగాంచి యిట్లనియె. నీవు ముందుగా వధ్యస్థానమునకుఁ బోయి నేను రోషముతో గుడికన్నుఁ జిట్టించినపుడు వధ్యుని విడిచిపెట్టి మీరు పారిపొండని ఘాతకులకు బోధింపవలయు. వార లీగుర్తు దెలిసికొని పరుగిడిపోవ నీవు శకటదాసు నటనుండి వెంటఁబెట్టుకొని రాక్షసునివద్దకుఁ జేర్పవలయు. మిత్రునిప్రాణములు గాచితివని మెచ్చి రాక్షసుం డొసఁగు పారితోషకము గ్రహింపవలయు. రాక్షసుని సేవించుచుఁ గొంతకాల ముండవలయు. శత్రుల యొద్దనుండి యిట్టిట్లు సేయవలయునని చెవిలోఁ గొంత గఱపెను.

అనంతర మావిష్ణుగుప్తుండు శిష్యునింబిలిచి కాలపాశికుఁడు దండపాశికుఁడు ననువారికి నిట్లు సెప్పుము. ఏమనిన "రాక్షసుని ప్రేరణంబున విషకన్యచే పర్వతకుని జంపిన జీవసిద్ధి యనువాని నీనగరమునుండి వెడలగొట్టుమని రాజాజ్ఞయాయెగాన నప్పని నిర్వర్తించుడని చెప్పుమని వచించి సిద్ధార్థకునకు రాక్షసుని ముద్రాంగుళీయముతోఁగూడ నద్దానిచే తొలుత ముద్రవైచియునిచినలేఖ నొసఁగి యనిపెను.

పదంపడి చాణక్యుండు రత్నవర్తకుఁ డగుచందనదాసుని బిలిపింప నతఁడు వచ్చినం గాంచి కూర్చుండఁబనిచి

చాణక్య—శ్రేష్ఠీ! మీవ్యవహారములు లాభకరములుగా నున్నవియే?

చంద—(తనలో) ఈయన యత్యాదరము భయజనకముగా నున్నది. (ప్రకాశముగా) తమ యనుగ్రహముచే వ్యాపారము సాగుచున్నది.

చాణ—చంద్రగుప్తునిదోషములు ప్రజలను నందరాజులగుణములను దలపింపఁ జేయుట లేదుగదా?

చంద—(చెవులు మూసికొని) పాపము శాంతించుగాక. శరత్కాల సంపూర్ణచంద్రుని చేతంబలె చంద్రగుప్తునిచేఁ బ్రజ లధికముగ నానందించుచున్నవారు.

చాణ—శ్రేష్ఠీ! అట్లేని నానందించుజనులవలన రాజులు ప్రత్యుపకారము గోరుదురు.

చంద—ఈజనునివలన నేమికార్యము కావలయునో ఆనతీండు.

చాణ—శెట్టీ! యిది యిపుడు చంద్రగుప్తరాజ్యముగాని నందరాజ్యము గాదు. గాన జనులు రాజునకు విరుద్ధముగా బ్రవర్తింపఁగూడదు.

చంద—అయ్యా! ఏనిర్భాగ్యుఁ డట్లు ప్రవర్తించును?

చాణ— అందు మొదటవాఁడవు నీవ.

చంద—(చెవులు మూసికొని) పాపము శాంతించుగాక. ఎం దేని గడ్డిపరక యగ్గితో విరోధము వెట్టుకొనునా?

చాణ.—రాజునకు నహితుఁ డగు రాక్షసుని గృహాజనము నిప్పుడు గేహమున నునిచికొని కాపాడుచున్నాడవు గదా! ఇది విరుద్ధము గాదా?

చంద—ఇది నిజము గాదు. ఎవఁడో తెలియక యిట్లు మీకు దెలిపెను.

చాణ—శెట్టీ! రాక్షసునిగృహాజనమును మా యధీనము సేయుము.

మాటాడకుము. రాక్షసుఁడు చంద్రగుప్తునిఁ దటిమి వేయునని తలంపకుము.

అని నుడువుచుండ వీధిలోఁ గలకలధ్వని వినంబడి యెను. అంత శార్ఙరవా! ఆధ్వని యేమి?

శిష్యుఁడు—రాజాజ్ఞచే జీవసిద్ధి యూరినుండి వెడలగొట్టబడు చున్నాఁడు.

చాణ—ఆ! క్షపణక! రాజునకు నప్రియము సేసినదాని ఫల మనుభవింపుము. చందనదాసా! అనిష్టముగా వర్తించిన వారియెడ రాజు కఠినదండము విధించెడిని. నామాట విని రాక్షసునిగృహాజనము నర్పింపుము. రాజు ననుగ్ర హాము వడయుము. అనుచు రాజవీధిలో తిరుగాధ్వని నాకర్ణించి

శిష్యా! అది యేమో తెలిసికొని రమ్ము.

నావిని వాడు పోయి తెలిసికొని వచ్చి—

శిష్య—గురువర్యా! రాజద్రోహి యగుశకటదాసుఁడు శూలా రోపణమునకై గొనిపోఁబడుచున్నాఁడు.

చాణ—స్వకర్మఫల మనుభవింపనీ? శెట్టీ! రాజద్రోహులకు శిక్ష యెట్లు జరుగుచున్నదో కంటివా? పరునికళత్రము నకై నీకుటుంబమును జీవితమునుగూడ నేల పోగొట్టు కొనియెదవు?

చందన—అయ్యా! నన్ను బెదరించెద రేల? రాక్షసునిగృహ జనము మాయింటనున్నను మీకు కప్పగించువాఁడను గాను. లేకున్న నెట్లులర్పింతును?

చాణ—ఇది నీ నిశ్చయమే యగునా?

చందన—ముమ్మాటికి నింతియె నానిశ్చయము.

చాణ—(తనలో) ఔరా! చందనదాసుడా? స్వార్థమువిడిచి పరార్థమునకై జీవితము నర్పించువాఁడు శిబికన్న నిం కొకఁడు లేడని యెంచితి. తిరుగ నీవంతవాఁడ వగు దువు. దాననే రాక్షసుఁడు నీయింట నిజకళత్రము నునిచిపోయెను. (ప్రకాశముగా) ఇది నిశ్చయమే?

చంద—బాగుగా

చాణ—దుష్టవర్తకుఁడా! రాజక్రోధము ననుభవింపుము.

చంద—సిద్ధముగా నున్నాఁడను.

చాణ—శార్ఙరవా! నేను చంద్రగుప్తునకు దెలుపుదనుక వీని ధనము నెల్లగైకొని పుత్రకళత్రములతోఁగూడ వీనిం గట్టివేసి యునుచుమని దుర్గపాలునకుఁ జెప్పుము. ప్రా ణహారమైనశిక్షను వృషలుఁడె నిర్దేశింపఁగలఁడు.

శిష్య—శెట్టీ! ఇటురమ్ము.

చంద—ఇదిగో వచ్చుచున్నాఁడను. నేను మిత్రకార్యమునకై నశించుచున్నాఁడగాని పురుషదోషమున గాదు. అనుచు నతఁడుపోయెను.

అనంతరము శిష్యుఁడు వచ్చి సిద్ధార్థకుఁడు వధ్యస్థానమునుండి శకటదాసునిఁ దోలఁగ దీసికొనిపోయెనని వచింప విని చాణక్యుండు కార్యారంభము జరిగెనని లోనసంతసపడి శార్ఙ్గరవా! ఏను బుద్ధిబలంబున నడవియేనుఁగునుం బలె రాక్షసుని నిగ్రహించి గ్రహింతునని ప్రతినసేసెను.

---

## తృతీయ ప్రకరణము.

### రాక్షసనీతి ప్రతిఘాతము.

---

రాక్షసుని గూఢచారుఁడగు విరాధగుప్తుఁడనువాఁడు పాములవాని వేషముతో పాటలిపుత్రమునందలి వృత్తాంతముల నరసి మరలి వచ్చువఱకు నమాత్యరాక్షసుం డిట్లు తలపోయుచుండెను.

ఎంతకష్టము సంప్రాప్తమయ్యెను? దైవయోగమున యాదవకులంబు పగిది నందవంశమంతయు నశింపఁ జింతాకులంబైన చిత్తంబున రేలుంబవళ్ళు నిదుర నెఱుంగక నాపదుప్రయాస మంతయు గోడలేని చిత్తరువుం బోలెడిని.

ఏను భోగంబుల వాంఛించియొ ప్రాణభంగంబునకు వెఱచియొ స్వప్రతిష్ఠ నాశించియొ యిట్లు గడంగి యుంటినా?

ప్రభువు స్వర్గస్థుఁ డైనను దదీయశత్రువులఁ జక్కాడి ప్రభువు నారాధించు కుతుకంబున నె రాజనీతియందు మనంబు జొన్పితి గదా ?

ఓసిరీ! పుడమిమీఁద నుత్తమక్షత్రకులజు లగురాజు లందఱు గాలిపోయిరే? కులహీనుం డగు మౌర్యపుత్రు నాశ్ర యించెదేల? చపలంబగులలనల చిత్తము పురుషునిగుణంబు గ్రహింపనేర్చునే ?

ఓ యవినీతురాలా ! నీ యాశ్రయముం భంజించి నిన్ను నిరాశ్రయం గావింతు జూడుము.

ఏను చందనదాసునింట గృహజనంబు నునిచి మంచి పని చేసితి. దీనిచే చంద్రగుప్తు నుచ్ఛేదించునెడ రాక్షసుఁడు సప్రయత్నుండను నమ్మకము గలుగుట నట మనపక్షమున నున్న వారి యుద్యమము శిథిలంబు గాకుండుంగదా ? అట్లు మనయత్నంబులు నెగింప బహుళధనంబొసఁగి శకటదాసు నునిచితి. అచ్చటి వృత్తాంతములు దెలుప జీవసిద్ధి మున్నగువారల నియోగించితి. వ్యాఘ్రశిశువుం బలె నెవ్వనిం బెనిచి ప్రభువు నాశమొందెనో వానిని బుద్ధివిశిఖంబునం భేదింతును. గాని వానికి దైవంబు గవచంబు గాకుండవలయుంగదా ? అని తల పోయుచుండఁ గంచుకివచ్చి రాక్షసు నవలోకించి ఆర్యా ! మలయకేతుఁడు తమతో నిట్లు విన్నవింపు మనియెను. మీకు శరీరసంస్కారము లేకుండుట నాకు విచారకరముగానున్నది. గాన నావిన్నపము నిరాకరింపకుఁడని తనమేనినుండి యీయా భరణములను దీసి యిచ్చెను. గాన ధరింపుడు. నావిని రాక్ష

సుఁడు కుసుమపురంబున సుగాంగమను సౌధమునందు నిన్ను సింహాసనాసీనుం జేయుదనుక శరీరసంస్కారము గావింపనొల్ల నని చెప్పుమని పలికి తత్ప్రార్థనంబున నాసోమ్ములందాల్చెను. అంతట విరాధగుప్తుఁడు రాగా చూచి.

రాక్షసుఁడు—సఖుఁడా! కుసుమపురవృత్తాంతము దెలుపుము.

విరాధ—చంద్రగుప్తుఁడు శకయవనకిరాతాద బలములతో కుసుమపురము ప్రవేశించినపిదప మీారంపినవిషకన్యచేఁ బర్వతకుఁడు నశించెను.

రాక్షసుడు—ఎంతచిత్రమో చూడుము. అర్జునుని జంపనెంచి కర్ణుఁడు గంటలశక్తిని గాపాడినట్లు నేను చంద్రగుప్తుం బరిమార్పనెంచి విషకన్యం డాచితిని. శ్రీకృష్ణుఁడాశక్తిని ఘటోత్కచునిమీాదఁ బఱపించినట్లు విష్ణుగుప్తుండా విష కన్యను పర్వతకునిపై వినియోగఁబఱచెగదా?

విరాధ—దైవము తన యిచ్ఛచొప్పున జేయుచున్నది. ఏమి సేయనగును.

అట్లు తండ్రి మృతినొంద మలయకేతుండు వెఱచి పరుగిడెను. అంతఁ బర్వతకునితమ్ముఁ డైనవైరోచకుని న మ్మించి యునిచి విష్ణుగుప్తుండు చంద్రగుప్తుఁడు నందభవనంబున ప్రవేశించునని చాటించి శిల్పులనందఱఁ బిలిచి యిట్లనియె.

అర్ధరాత్రసమయమునఁ జంద్రగుప్తుఁడు నందసౌధమునఁ బ్రవేశించునుగాన మీారందఱుఁ బూర్వద్వారము మొదలుగా నందభవనము నలంకరింపుఁడని వచింప విని వార లతని కిట్ల నిరి. ప్రథమద్వారమును దారువర్మ ముందుగనె సంస్కరిం

చెను. తక్కువాకిళులె మాచే సంస్కరింపఁబడవలయు నని తెలుప చాణక్యుండు 'ఔరా! మేము చెప్పకయె ముందుగపూర్వద్వారము దారువర్మ యలంకరించెనే? అతఁ డద్దానికిఁదగిన ఫలము వొందఁగలఁ డనియె.

అనంతరము కౌటిల్యుండు నేటిరాత్రి నందభవనప్రవేశము జరుగునని చెప్పి వైరోచకుని చంద్రగుప్తునితో నేకాసన మునఁ గూర్చుండఁబెట్టి యతనికి నర్ధరాజ్యమును విభజించి యిచ్చెను. అంత నాతనికిఁ జంద్రగుప్తునితో సమాన మగునలంకారము గావించి యెఱిఁగినవారికైన నిరువురలో భేదము గానిపింపకుండునట్లుపచరించి చంద్రగుప్తుఁ డెక్కునట్టి చంద్రలేఖయను నేనుఁగుమీఁద వాని నధిరోహితునిఁ జేయించెను. చంద్రగుప్తునితో రాజలోకము వెంబడివచ్చుచుండ వైరోచకుండు గజారూఢుండై ముందఱ వచ్చుచుండెను.

అప్పుడు మాప్రణిధి యగుదారువర్మ వైరోచకునిఁ జూచి చంద్రగుప్తుఁ డని భ్రమించి యంత్రతోరణము నాతని మీఁదఁ బడవేయ సిద్ధము సేసెను. అంతఁ జంద్రగుప్తునేనుఁగైనచంద్రలేఖకు మావటీఁడుగా నున్నమాగూఢచారుఁ డగు వర్వరకుఁ డనువాఁడు గజముమీఁద బంగరుగొలుసునకు గట్టియున్నకనకదండములోనిగత్తిని లాగనెంచి యాకనకదండము బట్టుకొనియెను. అది యేనుంగునకు దవులుటం జేసి యది బెదరి గతిభేదము నవలంబించెను. దానంజేసి దారువర్మ విడిచిన యంత్రతోరణము గుఱిదప్పి వర్వరకునిమీఁద బడిననప్పుడవాఁడు మడిసెను. అంతట దారువర్మ తనయంత్రతోరణము గుఱిద

ప్పినని యు ఆనేరమునఁ దన్నెట్లును వధింతురనియు నిశ్చయించి యున్నతస్థలముఁ జేరి యటనున్న యినుపకీలము నొకదానిని విస రివైవ వైరోచకుఁడు నీల్గెను.

రాక్ష—దైవయోగమున రెండును ననర్థములై జరిగెను. చం ద్రగుప్తుఁ డట్లయుండె. వర్వరక వైరోచకులు హతులైరిగదా? దారువర్మ వృత్తాంతమెట్లు?

విరాధ—వైరోచకునిముందున్న జనులు దారువర్మను గడ్డల తోఁగొట్టి గెడపిరి.

రాక్ష—మిత్రుఁడైనదారువర్మ కూలెనా? వైద్యుం డగున భయదత్తుం డేమిసేసెను?

విరాధ—అభయదత్తుఁ డొకనాఁడు విషమిశ్ర మగునౌషధ మును బంగరుగిన్నెలో సిద్ధపఱచెను. దానిని చాణక్య హతకుఁ డవలోకించి యిది మాఱురంగుతో నున్నది గాన విషమిశ్రము. దీనిం ద్రావవలదని మౌర్యపుత్రు నకుఁ దెలిపెను.

రాక్ష—వైద్యునిగతి యే మయ్యెను?

విరాధ—ఆమందు వైద్యునిం బానము సేయుమనిరి. వాఁడది గ్రోలి గంతు గొనియెను.

రాక్ష—ఆహా! ఎంత ఘనవైద్యుఁ డంతమొందెను? చంద్ర గుప్తుఁడు శయనించినప్పు డతనిం బరిమార్పనెంచి శయనగృహంబుగోడలలో డాగియున్న బీభత్సకుఁడు మున్నగువారలవృత్తాంత మేమి?

విరాధ—వారలవృత్తాంతము మహాఘోరము.

రాక్ష—వారం దుండిరని చాణక్యుఁడు దెలిసికొనలేదుగదా?

విరాధ—దురాత్ముఁడగు కౌటిల్యుఁడు చంద్రగుప్తునికంటె ముందుగా శయనగృహంబునకు వచ్చి నిపుణిమతోఁ బరిశీలింపఁ దొడంగెను. అపు డొకగోడబెజ్జమునుండి చీమలబారు వచ్చుచుండ నందొకచీమముక్కున నొక మెదుకుచిద్రుప గఱచుకొనియుండెను. దానిం జూడ గనె మర్మము గ్రహించి యీగేహము పురుషగర్భము. అని నిశ్చయించి దానిం గాల్పించెను. దానం జేసి బీభత్స కాదు లందు మ్రగ్గి బుగ్గియైరి.

రాక్ష—ఆహా! వాని కెంతదైవబలంబు గలిగియున్నది? నా చేయు జతనము లన్నియు బగతునకె యుపకారకంబు లగుచున్నవి గదా?

విరాధ—అమాత్యవర్యా! అట్లైనను మొదలిడినపని నడుమ విడువం జనదు.

ఆదిశేషునకు బరువు మ్రోయుట దుఃఖకరంబుగాదా? అతఁడు పుడమినేల పడవ్రేయ గూడదు? సూర్యునకు బరిశ్ర మంబు లేదా? ఆతఁడేల నిశ్చలంబుగా నుండరాదు? మొదలిడిన పని నిర్వహించుట సుజనులకుఁ గులవ్రతంబు గాన నది విడు చుట వారికి లజ్జాకరము.

రాక్ష—తరువాతవృత్తాంత మేమి?

విరాధ—చాణక్యుఁ డదిమొదలుకొని వేయివిధముల గనిపట్టి మనయాప్తుల నెల్లర నిగ్రహించుచున్నాఁడు.

రాక్ష—ఎవ్వారల నిగ్రహించెనో చెప్పుము.

విరాధ—విషకన్యనుఁ బర్వతకునిమీాదఁ బఱపెనని చెప్పి జీవసిద్ధి యనుక్షపణకుని నగరమునుండి వెడలగొట్టించెను. శకటదాసుఁడు దారువర్మాదులను రాజద్రోహంబునకై పురిగొల్పెనని వానిని శూలారోపణంబు సేయించెను.

రాక్ష—హా! శకటదాసుఁ డింతదుర్మరణంబు నొందెనే? ఇంకను సుహృద్వ్యసనంబులు విన సిద్ధముగా నున్నాఁడు. వినుపింపుము.

విరాధ—మీాగృహజనమును దమకు నప్పగింపలే దనుకారణమున చాణక్యుఁడు సర్వస్వమును దోచికొని చందనదాసునిఁ బుత్రకళత్రములతోఁగూడ బంధించి కారం బెట్టించెను.

అని చెప్పుచుండునంతలో శకటదాసుండు వచ్చి రాక్షసుని దర్శింప నతఁడు ఓయీా! నీవు కౌటిల్యుని బారిం బడియు నెట్లు మాకన్నుల కగఁబడితివని యడిగెను. నాపుడు వాఁడు సిద్ధార్థకునిం జూపి యీాతఁడు ఘాతకులం బారద్రోలి నన్ను నిటకుఁ జేర్చెనని దెలుప రాక్షసుండు "సిద్ధార్థకా! నీచేసిన యుపకృతికి నేమి యొసఁగినను జాలదు. అయినను నీయాభరణములం గ్రహింపుమని తనయొడలిమీాదినగల నన్నిటిం బారితోషికముగా నొసఁగెను.

అంత సిద్ధార్థకుఁ డాభూషణంబులం గ్రహించి విష్ణుగుప్తు నుపదేశముం దలంచికొని యిట్లు సేయుదునని నిశ్చయించి "నాకిందుఁ బరిచితులు లేరు. వలసినప్పుడు దీసికొని

యెద. దీని నిచటన యునుచుడని యానగలనూటమీఁద రాక్ష సునిముద్రాంగుళీయకముతో ముద్రవైచి యద్దానిని రాక్ష సునిభాండాగారముననె యునిచి ముద్రాంగుళీయకమును రాక్ష సునకు గనఁబఱిచెను. దానిం జూచి రాక్షసుండు నీ కిది యెట్లు లభించెనని యడిగి యిదికుసుమపురంబున చందనదాసు నింటివాకిట దొరకెనని వాఁడు తెలుప నిద్దానిని బత్నికి నిచ్చి వచ్చియుంటినని లోనం దలంచి దానిం గ్రహించెను. అప్పుడు సిద్ధార్థకుఁడు రాక్షసు నవలోకించి తమయనుగ్రహంబు నొందిన వానికి కౌటిల్యునాజ్ఞవలనఁ బాటలిపుత్రమున బ్రవేశము దుర్ల భము. గాన నేను గొంతకాలము మీ సాన్నిధ్యమున వసింప గోరెద నని విన్నవించి యమాత్యునిచే ననుమతుండై యట నుండెను.

పిమ్మట రాక్షసుఁడు శకటదాసు నుద్దేశించి నాముద్రాం గుళీయము నీవద్ద నునిచికొని నాపనులు నీవ నిర్వహించు చుండుమని యాయూర్మిక నతని కిచ్చెను. అంత గతిపయదినం బులకు నొకపురుషుండు మూఁడుతొడవులం దీసికొని విక్ర యింప నేతేర శకటదాసుండు వానిని రాక్షసునకు గనఁబఱి చెను. రాక్షసుఁ డానగలం గాంచి యివ్వి గొప్పవెల గలవి గాన వీనిం దెచ్చినవానిని సంతోషపెట్టి యీభూషణములం గ్రహింపుమని నుడువ నతం డట్లు సేసెను.

దైవహతిం జేసి తనయత్నంబు లన్నియు విఫలంబు లగుచున్నను నమాత్యరాక్షసుం డుద్యమంబు మాననేరక చాణక్యచంద్రగుప్తులకు భేదంబు గలుగఁ జేయనెంచి సమయంబు

గనిపట్టి మానో ద్రేకకరంబు లగువచనంబుల నుడువుడని వైతా ళికులకు గబురంపుటయు వారొకపరి యట్టియన్యాపదేశవచ నంబు వలుకగనే యాలించి కౌటిల్యుండు రాక్షసుభావంబు గ్రహించి చంద్రగుప్తునితో నేకాంతంబున మన మిరువురము గొన్ని నాళ్లు కలహంబు నభినయింపవలయునని బోధించి యత నితో గృతకకలహంబు గావించి విరుద్ధభావంబు నభినయించు చుండెను.

రాక్షసుండు చంద్రగుప్తచాణక్యులకు విరోధంబు గలిగె ననువార్త విని మలయకేతు నుద్దేశించి చంద్రగుప్తుం డమాత్య వ్యసనంబున నున్నవాఁడు. కాన నిప్పుడు మహాబలసహితంబుగ మౌర్యతనూజు నిరోధింపుమని బోధింప నతండు సన్నాహంబు సేయుచు నమాత్యరాక్షసుండు సత్యవచనుండై తనకు దోడ్పడునో లేక చంద్రగుప్తునితో సంధి గావించుకొనునోయని సంశ యించుచుండెను.

---

## చతుర్థప్రకరణము.

### రాక్షసమలయకేతుభేదము.

---

సిద్ధార్థకుఁడు మున్ను చాణక్యుఁడు శకటదాసునిచే వ్రాయించినలేఖను సొమ్ములమూటను దీసికొని బైలువెడలి పోవుచుండ జీవసిద్ధియను క్షపణకుం డగపడి యిట్లనియె.

క్షపణకు—నీ వెటకు బోయెదవు?

సిద్ధార్థకు—పాటలిపుత్రమునకుఁ బోవుదును.

క్షప—ఇటనుండి పోవువాఁడు భాగురాయణునిముద్రాలాంఛనము దీసికొనిపోవలయును.

సిద్ధా—నేను రాక్షసునిసంబంధిని.

క్షప—నీవు రాక్షసునిసంబంధివిగాని లేక పిశాచముసంబంధివిగాని యెటులైనను నిది తప్పనేరదు. ఏనప్పనికై పోవుచున్నాఁడ.

అని యతఁడు భాగురాయణునొద్దకుఁ బోవ భాగురాయణుండును వీనిం జూడఁగనే యితఁడు రాక్షసునిమిత్రుఁడైన జీవసిద్ధియని గ్రహించి,

భాగు—ఓయీ! నీవు రాక్షసునిపనికై పోవుచుంటివా?

క్షప—నేను రాక్షసునిపేరుగాని పిశాచముపేరుగాని వినంబడనిచోటునకే పోవుదును.

భాగు—మిత్రునిమీఁద నీకింత ప్రణయకోప మేల కలిగెను? అతఁడు నీకేదేని నపరాధము సేసియుండెనా?

క్షప—రాక్షసుఁడు నాకేమియు ద్రోహము సేయలేదు. నాచేసిన పనులయెడ నాకే లజ్జ కలిగెడిని.

భాగు—ఆపనుల నాకు వినుపింపుము.

మలయకేతుఁడు—(లోపలనుండి) నేనును వినఁగోరెద.

భాగు—రహస్యముగానిచో చెప్పుము.

క్షప—ఇది యంతరహస్యము గాదుగాని అతిక్రూరకృత్యమగుచు.

భాగు—నీ విధి వివరింపనిచో నేను ముద్రాలాంఛనము నీయను.

క్షప—చెప్పక యేమి సేయుదు? వినుడు. ఈయభాగ్యుఁడను మొదటఁ బాటలిపుత్రమున నుండుచు రాక్షసునితో మైత్రి సంపాదించితిని. ఆసమయమున రాక్షసుని ప్రేరణమునం జేసి విషకన్యంబఱపి పర్వతేశ్వరుని మడియించితి.

మలయకేతుఁడు—హా! నాతండ్రి రాక్షసునిచేతనె యంత మొందింపఁబడియె నా? చాణక్యునిచే గాదా?

భాగు—తరువాత వృత్తాంత మేమి?

క్షప—ఆసంగతి గ్రహించి చాణక్యుఁడు నన్ను నగరము నుండి వెడలఁగొట్టించెను. నేటికిని రాక్షసుఁడు నన్నుఁ బెక్కు రాజకార్యములలోఁ బనుపుచున్నాఁడు. వానిలో నొక్కటొకటియు నన్ను నీలోకమునుండి సాగనంపు నదియే.

భాగు—పర్వతేశ్వరుని మీఁద విషకన్యను చాణక్యుఁడుగదా ప్రయోగము సేయించెను?

క్షప—(చెవులుమూసికొని) పాపము శాంతించుగాక. చాణక్యుఁడు విషకన్య పేరే యెఱుఁగఁడు.

భాగు—ముద్ర యిత్తును. ఈవృత్తాంతము మలయకేతునకు వినిపింపుము.

అను నంతలో మలయకేతుఁడు వెలుపటకు వచ్చి.

మలయ—సఖుఁడా! వీనులు బ్రద్దలుసేయు నిమ్మాట వింటిని.

క్షప—(తనలో) నామాట మలయకేతువు వినియెగదా? నాపని తీరెను. అని క్షపణకుఁడు వెడలిపోయెను.

మలయకేతుఁడు—(ఆకాశము వంక చూచి) రాక్షసుఁడా! రాక్షసుఁడా! నీవుఁ దగును.

తనకు మిత్రుఁడవని యెంచి సకలకార్యములు నీయంద యునిచినమ్మియున్న నా తండ్రిని గెడపితివి. గాన సార్థకముగా రాక్షసుఁడవే యగుదువు.

సఖుఁడా! రాక్షసుని శీలము దెలిసెను. ఇపుడేమి సేయుదము?

భాగు—ఇపుడు రాక్షసునిం దూఱగూడదు. నందరాజ్యము లభించుదనుక నతనిని బట్టుకొనియె యుండవలయు. తరువాత నెట్లయినఁ జేయనగు.

మలయ—సఖుఁడా! నీ చెప్పినది యుచితముగా నున్నది. ఇపుడు రాక్షసుని సమయింతు మేని ప్రకృతిక్షోభంబు గలుగుం గాన మనకు జయము సందిగ్ధ మగును.

అనునంతలో నొక పురుషుండు వచ్చి మలయకేతునితో నిట్లని విన్నవించెను. దేవా! ఒకానొకఁడు ముద్రాలాంఛనము లేకయే యిక్కటకమునుండి వెడలిపోవుచుండగా పురరక్షకుఁడు లేఖతోఁగూడ వానింబట్టుకొని మీ సన్నిధి కనిచెను. వీనిం జూడుఁడు.

అని చెప్పిబంధించికొని రాఁబడినసిద్ధార్థకునిగనఁబఱిచెను. వానింజూచి భాగురాయణుఁడు.

భాగు—నీ వాగంతుకుఁడవా? లేక యిందుండువాఁడవా?

సిద్ధా—నేను రాక్షసుని సేవకుఁడను.

భాగు—ముద్రచీటి గైకొనక యెు యేల పోవుచుంటివి?

సిద్ధా—కార్యావసరముచే నట్లు పోయితిని.

భాగు—రాజశాసనముంగూడ నుల్లంఘించి పోవలసినంతకార్యమేమి ?

మలయ—భాగురాయణ! ఆలేఖ లాగికొనుము.

భాగు—(సిద్ధార్థకుని చేతినుండి లేఖను దీసికొని) కుమార! దీనిమీాద రాక్షసునిముద్ర యున్నది.

మలయ—ఆముద్ర చెడకుండునట్లు లేఖను విచ్చి చూడుము.

నావిని భాగురాయణుఁ డట్లు లేఖనువిప్పి చూపగా మలయకేతుఁ డిట్లని చదివెను.

స్వస్తి, ఉన్నచోటునుంచి యొకానొకఁ డొక్కపురుషునకు బోధించునది. యేమనిన, సత్యవాది వగునీవు మావిరోధిని నిరాకరింతునని యాడినమాట నిజము గావింపవలయు. ఇపుడు ముందుగ సంధిసేసికొనినమనమిత్రులకు వారికిఁ బ్రతిన సేసినది యిత్తుమని ప్రోత్సహించి ప్రీతి గలిగింపవలయు. ఇట్లు వారల ననుగ్రహించు నెడ వారు తామాశ్రయించినవానిం దెగటార్చి యుపకారముసేసినమిమ్ము నాశ్రయింతురు. నీవు సత్యసంధుఁడవుగాన నాడినమాట మఱువవు. అయినను జ్ఞాపనము సేయుచున్నాఁడను. ఈమిత్రులలో గొందఱు శత్రునికోశదండముల గోరువారును మఱికొందఱు దేశముగోరువారును నగుదురు. సత్యవచనుండ వగునీయంపినమూఁడాభరణములు నాకుఁ జేరెను. రిక్తహస్తముతోఁ బ్రభునకు లేఖ యనుప

గూడదను నాచారముంబట్టి యేదేనిఁ గొంచె మంపితిని. దీనిం గ్రహింపుము. విశేషములను పరమాప్తుఁ డగు నీజన్నునివలన వినునది.

మలయ——లేఖ యెట్లున్నది ?

భాగు——(సిద్ధార్థకుని జూచి) ఈలేఖ నెవ్వనియొద్దకు గొని పోవుచున్నాఁడవు ?

సిద్ధా——నాకుఁ దెలియదు.

భాగు——అరె! ధూర్తుఁడా ! ఎవ్వనికైనది తెలియకయే లేఖం గొనిపోవుచుంటివా ! భాసురకా ! వీని నవ్వలికిఁ గొని పోయి నిజము సెప్పుదనుకఁ దన్నుము.

నావిని భాసురకుఁడు సిద్ధార్థకునిఁ దాడనము సేయుచుండ నాతనికక్షమునుండి యొకమూటగ్రిందఁబడియెను. దానిందీసి కొనివచ్చి భాగురాయణునకు నియ్యగా నతఁడు సూచి.

భాగు——దీనిమీఁదగూడ రాక్షసునిముద్ర గలదు.

మలయ——రిక్తహస్తము గాకుండ ననిపినది యిదియె యైయుం డనగు? దీనినిగూడఁ బైముద్ర చెడకుండ విప్పిచూ పుము. నావిని యతం డట్లుసేయఁ జూచి,

మలయ——ఆహా! ఈనగలు నేను మేనినుండి తీసి రాక్షసు నకు నంపినవే! స్పష్టముగ నీలేఖ చంద్రగుప్తునకంపినదే!

భాగు——ఇది నిజమో ? సంశయమో ? భాసురకుఁడా ! వీనిని బాగుగా మర్దింపుము.

సిద్ధార్థకు——(పాదములమీఁదఁబడి) అభయ మొసగుదు రేని నిజము విన్నవింతును.

మలయ—చెప్పినంత సేయువాఁడవు. ఇందునీనేరమేమి? నీ కేమియు భయములేదు. నిజము దెలుపుము.

సిద్ధార్థ—అమాత్యరాక్షసుఁ డీలేఖను చంద్రగుప్తున కిమ్మని నన్నుఁ బనిచెను.

మలయ—నిన్నుచటఁ జెప్పుమనిన మాట లేమి?

సిద్ధార్థ—రాక్షసుఁడు చెప్పుమనిన దేమనిన?

కులూతాధిపతి యగుచిత్రవర్మయు మలయనగరాధిపతి యగు సింహనాదుఁడును కాశ్మీరదేశాధిపతి యగుపుష్కరాక్షుఁడును సింధుదేశపతియగు సింధుసేనుఁడును పారసీకుఁడగు మేఘనాదుఁడును నీయేఁగురు మనకు మిత్రులు. వీరిలో మొదటిముగ్గురు మలయకేతుని రాజ్యము గోరుచున్నారు. కడమయిద్దఱిలో నొకఁడు హస్తిబలమును ఇంకొకఁడు కోశబలమును గాంక్షించుచున్నారు. చాణక్యుని నిరాకరించి నాకు సంతసము గలిగించినట్లు వీరికిని వాగ్దానము సేసినది చెల్లింపుమని చెప్పుమనియెను.

మలయ—(తనలో) ఎట్లూ! చిత్రవర్మాదులు నాయెడ ద్రోహముసేయఁ గాచికొని యున్నవారే? (ప్రకాశముగా) విజయా! రాక్షసుని బిలువుము.

నావిని ప్రతీహారి పోవువఱకు నటరాక్షసుండు పాటలిపుత్రమునకై దండయాత్రకుఁ బోవరాజులను బ్రోత్సహించుచును బ్రతీహారిం జూచి యది చెప్పినమాటవిని వారిననిపి శకటదాసుంగాంచి యిప్పుడు మలయకేతునిఁ జూడబోవలయు. అలంకారరహితముగా బోఁ గూడదు. గాన మనము

గొన్నవానిలో నొక్కటి యిమ్మని వానివలన గ్రహించి యది ధరించి మలయ కేతునొద్దకు వచ్చి,

రాక్ష—కుమార! జయ మగుగాక.

మలయ—నమస్కరించుచున్నాఁడ కూర్చుండుడు. మీదర్శ నము సేసి పెక్కు నాళ్ళగుటచే నాచిత్తము వ్యాకు లముగా నున్నది.

రాక్ష—దండయాత్రవిషయమున దగువిధానము నాలోచించు చుంటం జేసి కుమారునిచే నిట్లు మాట వడితిని.

మలయ—దండయాత్రవిషయమున నేమి యాలోచించితిరి?

రాక్ష—ఖశ మగధాధిపతులు ననుంగూడి సేనలతో వ్యూహ ము వన్నుకొని ముందును, గాంధారులు యవనులు నడుమను, శకులు, చీనాదేశీయులు, హూణులు వెను కను, కులూతాధిపతి మొదలగు రాజు లందఱు నిన్ను జుట్టుకొని యావెనుకను నివ్విధమున చంద్రగుప్తుని వీటికి దాడి వెడలవలయునని నియోగించితిని.

మలయ—(తనలో) నన్నుఁ దెగటార్చి నారాజ్యము నపహ రింపఁ జూచు కులూతాధిపతి మొదలగు వారినె నాకుఁ జుట్టునుండునట్లు విధించెను. (ప్రకాశముగా) ఆర్య! ఎవఁడైనఁ గుసుమపురమునకు బోవుటగాని యటనుండి వచ్చుటగాని కలదా?

రాక్ష—రాకపోకలవలని ప్రయోజనములు సమాప్తమయ్యెను. కొలఁదిదినములలో మనమె పోదుము.

మలయ—(తనలో) చంద్రగుప్తునకు మంత్రిత్వము సేయఁ బోదునని తెలియుచునే యున్నది. (ప్రకాశముగా) అట్లేని లేఖతో నీమనుజు నెట్టు లటకు ననిపితివి?

రాక్ష—(చూచి) సిద్ధార్థకా! ఏమిరా యిది?

సిద్ధా—(కన్నీరు విడిచి లజ్జపడుచు) అనుగ్రహింపవలయు. నన్ను గొట్టగా రహస్యము దాపఁజాలనైతి.

రాక్ష—రహస్య మేమిరా? నాకేమియుఁ దెలియుట లేదు.

సిద్ధా—చావమోదిరి. ఏమి సేయుదును?

మలయ—భాగురాయణ! రాక్షసునెదుట వీఁడు భయపడి నిజము సెప్పఁజాలకున్నాఁడు. నీవు చెప్పుము.

భాగు—అమాత్య! మీరు లేఖనిచ్చి రహస్యముగాఁ గొన్ని మాటలు చెప్పుమని తన్ను ననిపినట్లు వీఁడు చెప్పుచున్నాఁడు.

రాక్ష—సిద్ధార్థకా! ఇది నిజమే?

సిద్ధా—నన్ను మిక్కుటముగాఁ గొట్టగా నట్లు సెప్పితిని.

రాక్ష—ఇది నిజముగాదు. దెబ్బలు వడఁజాలక యేదేని జెప్పుట కలదు.

మలయ—భాగురాయణ! లేఖం జూపుము. సందేశము వాఁడె చెప్పును.

భాగు—అమాత్యా! లేఖ యిది.

రాక్ష—(చదువుకొని) కుమార! ఇది శత్రుని ప్రయోగము.

మలయ——రిక్తహస్తముగా లేఖ ననుపఁగూడదని యాభరణ ములఁగూడ ననిపియుంటిరి. ఇది శత్రుని ప్రయోగమెట్లగును ?

రాక్షస——(ఆభరణములను జూచి) కుమారుఁడు వీనిని నాకై యనిపెను. వీనిని నేనొకప్పుడు సిద్ధార్థకునకు బహుమానము నిచ్చియుంటిని.

భాగు——ఇంత యనర్ఘాభరణములు, అందును రాజకుమారుఁడు తనయొడలినుండి తీసి యనుగ్రహించినవి ఎవ్వానికేని నీఁదగినవే ?

మలయ——వీనివలనఁ గొంతసందేశము వినవలయుననియు నాలేఖయందు గలదు.

రాక్ష——సందేశ మెవ్వఁడు సెప్పెను ? ఎవనికిఁ జెప్పెను? ఈలేఖయె నాదికాదు.

మలయ——అటులేని నీముద్ర యెవ్వనిది ?

రాక్ష——ధూర్తులు కపటముద్రను బుట్టింపగలరు ?

భాగు——రాజా! రాక్షసుఁడు చెప్పునదిసరిగా నెతోచుచున్నది. సిద్ధార్థకా ! ఈలేఖ వ్రాసిన వాఁడెవ్వఁడు ? నావుడు సిద్ధార్థకుఁడు రాక్షసుని మొగము చూచి తలవంచుకొని యూరకుండెను.

భాగు——అరే ! తిరుగ దెబ్బలు దిన నేల ? చెప్పుము.

సిద్ధా——శకటదాసుఁడు వ్రాసెను.

రాక్ష——దీనిని శకటదాసుఁడె వ్రాసియున్నచో నే నంపినట్లే.

మలయ—విజయా! శకటదాసుని బిలువుము.

భాగు—కుమార! రాక్షసు నెదుట శకటదాసుఁడుదీనిని తాను వ్రాసితినని యొప్పుకొనఁడు. కావున వానిచే నేదేని వ్రాయించి తెప్పించునెడ నక్షరములపోలికయె నిజము తేల్పఁగలదు.

మలయ—విజయా! శకటదాసుని స్వహస్తలిఖితమును రాక్షసుని ముద్రను రెంటిని దెమ్ము.
అంత నదిపోయి యారెంటిని గొనిరాఁ జూచి

మలయ—అక్షరములపోలిక యేమియు భేదింపలేదు.

రాక్ష—(తనలో) పోలికసరిపోయెనా? ధనాశచేనతఁడిట్లు చేసెనో? ఇందుసందియ మేమి? నాముద్ర వానియొద్ద నేయున్నది. లేఖలోనియక్కరములు వానివే. పరులతో సంధిచేసికొని శకటదాసుఁ డిట్టిపని చేసియుండనోపు?

మలయ—ఆర్యా! ఈలేఖయందు మీరంపిన మూఁడునగలు మాకుఁ జేరెనని యున్నది. మీరు ధరించినది వానిలో నొకటియెగదా? (ఈయాభరణము నాతండ్రి ధరించినదియె యని గుర్తు పట్టి (ప్రకాశముగా) ఇది మీ కెట్లు వచ్చెను?

రాక్ష—వర్తకులు విక్రయింపఁ గొంటిని.

మలయ—విజయా! ఈభూషణము నీవు గుర్తు పట్టితివా?
ప్రతీహారి—ఇది మీతండ్రిగారు ధరించినదే.

రాక్ష—(తనలో) ఇది పర్వతేశ్వరుఁడు ధరించెనని చెప్పుచున్నది. (ప్రకాశముగా) వీనిని చాణక్యుఁడె వర్తకుల కిచ్చియనుప నేను వారియొద్దఁ గొనియుంటి.

మలయ—మాతండ్రి ధరించినవి. చంద్రగుప్తునకుఁ జిక్కినవి, వీనిని వర్తకులు విక్రయించి రనుట యెట్లు సంగతమగును? ఒక్కవిధముననిది నిజమే. ఎట్లన,

చంద్రగుప్తుఁడధికలాభము గోరి యీ భూషణములను నీకు విక్రయింపఁ గ్రూరుఁడ వగునీవు మమ్ముం గ్రయధనముగా నతని కర్పింప నెంచితివి.

రాక్ష—(తనలో) శత్రుప్రయోగము సంకటముగా నేర్పడియెను.

లేఖమీద నాముద్ర కనఁబడుచుండ నిది యేనంపినది కా దనుట యెట్లు? శకటదాసుఁడు మోసము సేసె ననిన నెవ్వరు నమ్ముదురు? చంద్రగుప్తుఁ డీతొడవుల విక్రయము సేయించెననిన నేవారు విశ్వసింతురు? గాన దీని నేనొప్పుకొనుటయ యుచితము.

మలయ—ఆర్యుని నేనిది యడుగుచున్నాఁడను.

రాక్ష—ఆర్యుఁ డెవఁడో వాని నడుగుము. ఇపుడు నే ననార్యుఁడ నైతిని.

మలయ—మౌర్యుఁడు నీకు స్వామిపుత్రుఁడు. ఏను నీకు మిత్రపుత్రుఁడను. అతఁడు నీకు ధనము నిచ్చును. ఇచట నాకు నీ విచ్చువాఁడవు. అచట మంత్రిగా నుందువు.

ఇచట ప్రభువుగా నుందువు. ఏమి యాధిక్యముగోరి యిట్టిపని చేసి యనార్యుఁడ వైతివి? లేఖతోఁ గనిపిన సొమ్ములం జూడుము. ఇది యేమి?

రాక్ష—ఇది విధివిలాసము.

మలయ—ఇంకను గప్పిపెట్టుచుంటివా? ఇది విధివిలాసమా? లోభవిలాసము గాదా?

అనార్య! కృతఘ్నుఁడా! విషకన్యను బ్రయోగించి నిన్నునమ్మిన నాతండ్రిని జంపించితివి. ఇపుడు మంత్రిపదవి నార్జింపనెంచి నీయందు సర్వకార్యభార ముంచినమమ్ము మాంసముంబలె విక్రయించికొనఁ దలపెట్టితివి.

రాక్ష—(తనలో) మర్మస్థాన వ్రణముమీద నింకొకవ్రణము. (ప్రకాశముగా) చెవులుమూసికొని, పాపము శాంతిం చుగాక, పర్వతేశ్వరునిమీద విషకన్యను బంపినది నేను కాదు.

మలయ—అట్లని మాజనకునిఁ జంపించినవాఁ డెవఁడు?

రాక్ష—దైవము నడుగవలయు.

మలయ—దైవము నడుగవలయునా? క్షపణకుఁ డైన జీవసిద్ధి నడుగ నక్కఱలేదా?

రాక్ష—(తనలో) జీవసిద్ధియుఁ జాణక్యునిగూఢచారుఁడే? ఆహా! శత్రువులు నాహృదయముగూడ స్వాధీనము సేసికొనిరి.

మలయ—(క్రోధముతో) భాసురక! రాక్షసునకు మిత్రులై నాకు ద్రోహము సేయఁబూనిన కులూతాధిపతి మొద

లగువారిలో మొదటివుువ్వరు నాభూమి నేలగోరు
చున్నారు గాన వారిని లోతైనగుంటలలో నునిచి
పూడిపింపుమనియు, మదీయహస్తిబలము నాశించిన
వారిని హస్తితోనె త్రొక్కించి రూపుమాపుమనియు
శేఖర సేనునితోఁ జెప్పుము.

రాక్షసుఁడా! రాక్షసుఁడా! నేను విశ్వాసఘాతి నగు
రాక్షసుఁడగాను. మలయ కేతుడను. పొమ్ము. అన్నివిధముల
చంద్రగుప్తనే యాశ్రయింపుము. చూడుము.

విష్ణుగుప్తుఁడు, చంద్రగుప్తుఁడు వీరిద్దఱు నీతోగూడి
వచ్చినను, దుర్ణయము ధర్మకామార్థములంబలె మీముువ్వు
రను నిర్మూలము సేయఁజాలుదును.

భాగు—కుమార! కాలహరణమేల? కుసుమపురము నిరో
ధింప సేనలకు ననుజ్ఞ యిమ్ము.

నా విని మలయకేతుండు ప్రస్థానోద్యమమున నుండెను.
అంతట రాక్షసుండు తనలో ఎంతకష్టము ప్రాపించెను? రాక్ష
సుఁడు సేయునుద్యమము శత్రునాశనమునకు గాదు. మిత్ర
వినాశమునకే వినియోగించుచున్నది. అభాగ్యుఁడ నేనిప్పు
డేమి సేయుదు?

ఏను తపోవనంబున కేగుదునా? సవైరంబగు నాడెం
దము తపముచే శాంతినొందనేరదు. శత్రువు జీవించియుండ
స్వామి ననుగమింతునా? ఇది స్త్రీజనకృత్యంబగును. ఖడ్గ
మాత్రసహాయుండనై శత్రుబలంబునం బడుదునా? అది నిష్ఫ
లంబయగు. చందదాసును బంధముక్తునిఁ జేయఁబూననిచోఁ

గృతఘ్నుండ నగుదునని యెంచి పాటలిపుత్రమునకు బైలు దేరెను.

---

## పంచమప్రకరణము.

### రాక్షస వశీకరణము.

---

సిద్ధార్థకుఁడు చాణక్యుఁ డుపదేశించిన కార్యమునఁగృతార్థుఁడై పాటలిపుత్రమునకు వచ్చి మలయకేతుఁడు మీ ప్రయోగంబునం జేసి రాక్షసుని వదలిపెట్టె ననియు, చిత్రవర్మాది మిత్రుల వధించెననియుఁ జాణక్యునకుఁ దెలుప నతఁడు ప్రహర్షంబునొంది యీయుదంతమును మహారాజునకు, దెలుపుమని చెప్పెను. చంద్రగుప్తుండు సిద్ధార్థకునివలన నీవృత్తాంతము విని చాణక్యుని మాహాత్మ్యంబునకు నచ్చెరు వందెను.

మలయకేతుఁడు చిత్రవర్మాదులను వధింపఁ దక్కువారిలో ముఖ్యులును మలయకేతుని వదలిపెట్టిపోయిరి. అయినను బర్వతకపుత్రుఁడు భాగురాయణునితోఁగూడి నిజబల సహితుఁడై పాటలిపుత్రంబు నిరోధించెను. అంత చాణక్యుండు సారవంత మగుసేనానివహము నంపి వానింజయించి భాగురాయణునితో బంధించి కారం బెట్టించెను.

రాక్షసుండు మలయకేతుని కటకంబు విడిచి ఖడ్గహస్తుండై యుదుంబరకుఁ డనుచారునితోఁ బాటలిపుత్రమునకు వచ్చుచు నిట్లుతలపోయఁదొడంగెను.

రాజలక్ష్మి తనయాశ్రయము నశింపగనే కులట వోలె నితరకులజు వరించెను. గతానుగతికు లగు జనులును దానినె వెంబడించిరి. ఆ ప్రజనులును పురుషకారము ఫలింప మింజేసి కార్యభారము విడిచిరి. అట్లుగాక తలలేని మొదలి యంగములవోలె మున్నవా రేమిసేయఁగలరు ? ప్రభువు మృతి నొందినను పర్వతేశ్వరు నాశ్రయించి యత్నము సేసితి. అతఁడు నశించినను వాని పుత్రునిజేరి సోద్యముఁడ నైతి. అయి నను జతనము నెఱవేర దయ్యె. నందకులంబునకు శత్రువు దైవమెగాక యీవిప్రుండు గాఁడు.

రాక్షసుఁడు శత్రుహస్తగతుఁడై నాశమునైన నొందు గాని చంద్రగుప్తునితో సంధి చేసికొనునె? జనులు నన్ను సత్య సంధుఁడుకాఁ డన్నను మేలకాక శత్రువంచనకు లోఁబడియె ననుట సహింపనేర్తునే ? అని చింతించుచుఁ బాటలిపుత్రప్రాంత వనంబునకుఁ జేరి మందభాగ్యుఁడ నెటకుఁ బోవుదును? ఇం దొక చోట నుండి యెవ్వానిచేనైన చందదాసుని వృత్తాంత మరయుదునుగాక యని యెంచి యొకరాతిమీఁద గూర్చుండి యిట్లు చింతించెను.

పూర్వము బాలచంద్రునివోలె జనులవ్రేళులచేఁ జూపం బడుచు రాజసహస్రంబులతోఁగూడి రాజువోలె పురంబు వెడ లునేన యిప్పుడు విఫలయత్నుండనై దొంగవోలె వెఱచి యీజీర్ణోద్యానమునం డాగవలసెగదా ? అని చింతించుచుండ గొప్ప శంఖధ్వానంబు వినంబడియె. రాక్షసుండాధ్వని యా లించియిదిమలయకేతునిబంధించినయుత్సవ కార్యముగానుండు

నని యూహించి 'ఎంతకష్టము? దైవము శత్రుని సిరిని విని పించెను. అభినయించియుఁ గనఁబఱిచెను. మఱియు నాకు దానినిఁ బ్రత్యక్షముసేయ నెంచినట్లు తలంచెదనని చింతించు చుండెను.

విష్ణుగుప్తుండు చారులవలన రాక్షసుఁడు జీర్ణోద్యానము ప్రవేశించెనని యాకర్ణించి కర్తవ్యము బోధించి యటకునొక పురుషు ననుప వాఁడు త్రాడొక్కటి చేఁబూని యవ్వనంబు సొచ్చి కొంచెము దూరమున నుండియె రాక్షసు నవలోకించి యతనిం జూడనియట్లు నటించుచు నొకచెట్టు గొమ్మకుఁద్రాడు కట్టి దానిం దనమెడకు నురివోసికొనుచుండెను.

రాక్షసుండు వానింజూచి 'అయ్యో! వీఁడెవఁడో నను బలె దుఃఖగ్రస్తుఁడు గాఁబోలు? కానిమ్ము. అడుగుదును గాక యని దగ్గఱకువచ్చి

రాక్ష.—నీవు చేయున దేమి?

పురుషుఁడు—(కన్నీరువిడుచుచు) అయ్యా! ప్రియమిత్రవినాశ మున శోకగ్రస్తుఁడనై యిట్లు సేయుచుంటిని.

రాక్ష—(తనలో) వీఁడు ననుఁబోనివాఁడని ముందుగనె గ్రహించితిని. (ప్రకాశముగా) రహస్యముగాని చో శోకకారణము నాకు దెలుపుము.

పురు—అయ్యా! ఇది రహస్యముగాదు. గాని చెప్పుదనుక మరణింప గాలహరణము సేయజాలను.

రాక్ష—(నిట్టూర్పు విడిచి తనలో) మిత్రవ్యసనమున నుదాసీనుఁడనై యున్న నాకు నితఁడు కర్తవ్యమును బోధింప వచ్చెనుగాఁబోలు ? (ప్రకాశముగా) త్వరగాఁ జెప్పుము.

పురు— నిర్బధించుచున్నారు. ఏమి సేయుదు? వినుడు. ఈనగరమున రత్నవర్తకుఁడు విష్ణుదాసుఁ డనియొకఁడు కలడు.

రాక్ష—(తనలో) విష్ణుదాసు చందనదాసునకు మిత్రుఁడే. (ప్రకాశముగా) వాని కేమి ?

పురు— అతఁడు నాకుఁ బ్రియమిత్రుఁడు.

రాక్ష—(సంతసమునఁ దనలో) అయ్యో ! ప్రియమిత్రు డనుచున్నాఁడు. మఱియు దగ్గఱసంబంధమే. అబ్బ ! ఇఁక చందనదాసునివృత్తాంతము దెలియును. (ప్రకాశముగా) వాని కేమి ?

పురు—అతఁ డగ్నిలో నుఱుక నెంచి యూరు వెడలివచ్చెను. మిత్రునిమరణవార్త వినకమున్న యుసురుల విడువఁ బూని యీపాడడవిఁ జేరితి.

రాక్ష—అతఁ డట్లు సాహసింప నేమి కారణము ?

పురు—ఆతనికిని మిత్రవ్యసనమే హేతువు.

రాక్ష—అదియెట్టిదో వివరముగా దెలుపుము.

పురుషు—ఈనగరమున మణికారశ్రేష్ఠి చందనదాసుఁ డని వేరొక్కఁడు గలఁడు.

రాక్ష—(దుఃఖమునఁ దనలో) దైవ మింకొక శోకద్వారము దెఱచెను. డెందమా ! నిలుకడ నొందుము. అతికష్ట

వార్త వినవలయు సుమా? (ప్రకాశముగా) చందనదాసుఁడు మిత్రవత్సలుఁడు వాని కేమి?

పురు—అతఁడు విష్ణుదాసునకుఁ బ్రియమిత్రుఁడు.

రాక్ష—(తనలో) మానసమునకు దుఃఖవజ్రపాతము సమీపించెను.

పురు—కావున చందనదాసునిమిత్తమె విష్ణుదాసుఁడు మిత్రస్నేహమునకుఁ దగునట్లు జంద్రగుప్తునితో నిట్లు విన్నవించెను.

రాక్ష—ఏమని?

పురు—దేవ! నాసర్వస్వమును దీసికొని చందనదాసును విడిపింపు మని,

రాక్ష—(తనలో) విష్ణుదాస! మిత్రస్నేహము కనఁబఱచితివి. ఏలన, కొడుకులు దండ్రులను తండ్రులు కొమరులను శత్రువులంబలె నెద్దానికై హింసించుచుందురో అట్టి ధనమును వర్తకుఁడ వయ్యునుమిత్రునికై దుర్వ్యసనముంబలె విడువ నెంచితివి. గాన నీధనమె సార్థక మైనది. (ప్రకాశముగా) దానికి మౌర్యుఁ డేమిబదులుసెప్పెను?

పురు—అయ్యా! ఏమి సెప్పెననిన

నేను ధనమునకై చందనదాసుని బంధించినవాఁడ గాను. ఇతఁడు రాక్షసునిగృహజనమును దనయింట దాచియుంచికొని యెంత బ్రతిమాలినను మాయధీనము సేయఁడయ్యెను. ఇప్పటికైనను నతఁడు రాక్షసునిగృహజనమునర్పించు నేని విడిపింతును. లేనిచో బ్రాణములు దీయింతునని పలి

చందనదాసుని వధ్యస్థానమునకుఁ బనిపెను. చందదాసుని మరణవార్త వినకమున్న జ్వలనంబునఁ బ్రవేశింపనెంచి విష్ణుదాసుఁడు పురంబు వెడలిపోయెను. నేనును నాప్రియమిత్రుఁడగు విష్ణుదాసుని మరణవార్త వినకమున్న యురివైచికొని యసువుల విడువనెంచి యిటకు వచ్చితిని.

రాక్ష—చందనదాసు నిప్పటికి వధింప లేదుగదా ?

పురు—ఆతఁ డిప్పుడె వధింపఁబడును. ఇప్పటికిని రాక్షసునిగృహాజనము నర్పింపుమని కోరుచున్నను నతఁడుమిత్రవత్సలుఁ డగుటంజేసి యప్పని నంగీకరింప దయ్యెను. ఈకారణమున నే నీఁకఁగాలహరణము సేయఁజాలను.

రాక్ష—(తనలో) మిత్రమా ! చందనదాసా ! ఎంతపనిసేసితివి?

శరణాగతరక్షణమున నీవు శిబి దగుకీర్తి నార్జించితివి. అతఁడు శరణాగతునెదుట దనశరీరము నర్పించెను. నీవైననో పరోక్షముననె యర్పించుచున్నాఁడవుకాన నతనికంటెను నధికుఁడవు.

(ప్రకాశముగా) భద్రుఁడా ! నీవు వేగిరమున బోయి విష్ణుదాసుఁడు జ్వలనమునఁ బడకుండ వారింపుము. ఏను పోయి చందనదాసుని విడిపింతును.

పురు—నీ వేవిధమునఁ జందనదాసును మృత్యుముఖమునుండి విడిపింతువు ?

రాక్ష—(వఱనుండికత్తిపెఱికి) ఈఖడ్గముతో విడిపింతును.

పురు—అయ్యా! మీ రమాత్యరాక్షసులవారు కావలయు? మిత్రవ్యసనముచే మిమ్ము గుర్తింపఁజాలనైతి. అని పాదములఁ మీద బడియెను.

రాక్ష—లెమ్ము. లెమ్ము. ఇపుడు కాలహరణము సేయరాదు.

పురు—అటులేని ననుగ్రహించి నామాట యొకటి యాలింపుఁడు.

రాక్ష—ప్రభునాశము ననుభవించుటెగాక యిందఱు మిత్రుల విపత్తికిఁ గారణుఁడనై యనార్యుఁడ నగునేను యథార్థముగ రాక్షసుఁడనే.

పురు—దైవవశమునఁ గనంబడితిరి. ఈమాట యవధానముతో వినుఁడు. ఇచట మొదటఁ శకటదాసుఁడు వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడినపుడు వాని నెవ్వడో ఘాతకుల బాఱినుండి తొలఁగించెను. అంత చంద్రగుప్త హాతకుఁడు "ఎవఁడు చేసెను? ఎట్లుసేసెనని మండిపడి ఘాతకులఁ జంపించి తన క్రోధాగ్ని శాంతిపఱుచుకొనియెను. అది మొదలుకొని ముందుగాని వెనుకగాని యాయుధహస్తుఁడు కనఁబడునెడ తమచావు దప్పించుకొననెంచి ఘాతకులు వధ్యులను ముందుగనె వధించుచున్నారు. గాన మీరు కృపాణపాణులై యటకుఁ బోవుదురేనిఁ జందనదాసుని ముందుగనే చంపించినవారగుదురు.

అని చెప్పి వాఁడు వెడలిపోయెను.

అంత రాక్షసుఁడు తనలో నిట్లు వితర్కించెను. ఈని స్త్రీంశంబున ఘాతకులఁ జంపఁబూనుదునా? నను జూడగనె వారు ముందుగఁ జందనదాసుని ఖండింతురుగాన నిది కూడదు. నీతి నుపయోగింపఁ జూతునా? ఎదుట క్రూరసర్పము, దూర దేశంబున దండము, ననునట్టు లిప్పు డుపయోగింపదు. ఉపేక్షింతునా? కృతఘ్నుండ నగుదునుగాన చందనదాసునకు బదులు నాశరీరము నర్పించి మిత్రునిం గాతునని నిశ్చయించి వధ్య స్థానమునకు నరిగెను.

అట చండాలురు "జనులారా! తొలఁగిచనుడు. మీరు ప్రాణములను విభవమును కులమును గళత్రమును గాచికొనఁ దలంతురేని త్రానికి నహితము నాచరింపకుఁడు. జను డపథ్యమును సేవించునెడ వ్యాధియో మరణమో కలిగెడిని. రాజాపథ్యము సేసెనా! వానికుల మంతయు నంతమొందు. మా మాట నమ్మరేని పుత్రకళత్రంబులతోడ వధ్యస్థానము జేర్పం బడుచందనదాసుం జూడుఁడు. అని పలుకుచుండఁ జందనదాసుండు వధ్యవేషంబు దాల్చి శూలముం బుజమున నిడికొని పత్నియుం బుత్రుండును వెంబడిరాఁ బోవుచు 'హా! ఎంత కష్టము? నడతలో నేమిలోపము వాటిల్లునో యని వెఱచు మముబోంట్లకును చోరజనోచితం బగుమరణంబునో సఁగుశమునునకు నమస్కృతి సేసెద. అటుగాక, క్రూరులకు నుదాసీనుల యందును నితరులయందును భేదంబు గనంబడదు. మాంసాహారంబు విడిచి యడవులలో దృణంబులచే జీవించు లేళ్లను కూడ వారు వధించుచుందురుగదా? ప్రియమిత్రమా! విష్ణు

దాసుఁడా! బదులుమాటైనఁ జెప్పవేల? నామిత్రులు గన్నీరు విడిచి తర్పణంబు సేసినట్లు యెట్లో వెనుకకు మరలుచు శోకంబున దీనవదనులై గన్నీరు నిండినగన్నులతో నన్ను గాంచుచున్నారు.

చండాలు—అయ్యా! చందనదాసుఁడా! వధ్యస్థానము సేరితివి. పరిజనము నంపివేయుము

చందన—సతీతిలకమా! ఇఁక నుండఁగూడదు. నీవిపుడు కొడుకుతో నింటికిఁ జనుము.

కుటుంబిని—నాథా! మీరు పరలోకమునకుఁ బయనమైతిరి. గాని దేశాంతరము గాదుగదా!

చందన—గుణవతి! నేను మిత్రకార్యమున వినాశ మొందుచున్నాఁడగాని పురుషదోషమున గాదు. ఇఁక దుఃఖపడనేల?

కుటుంబిని—అట్లేని నిది కులాంగనకు మిమ్ము విడిచిపోవఁదగు సమయము గాదు.

చందన—నీనిశ్చయ మేమి?

కుటుంబి—మీపాదముల ననుసరించివచ్చిననే నాజన్మము కడ తేరునని

చందన—నీయుద్యమము మంచిదిగాదు ఏలందువేని? నీచిన్నవాఁడు లోకవ్యవహారము నెఱుంగఁడు. వీని ననుగ్రహింపుము.

కుటుంబిని—వీనిని దేవతలనుగ్రహింతురుగాక. కొడుకా! తండ్రిగారి పాదములు నీకిఁక దొరకనేరవు. వానికిఁ బ్రణామము గావింపుము.

పుత్త్రుఁడు—(పాదములమీఁదఁ బడి) నాన్నగారూ! మిమ్ము వదలిపెట్టి యేనేమిసేయుదు?

చందన—పుత్త్రా! నీవు చాణక్యుఁడు లేనిదేశమున నుండుము.

చండాలు—చందనదాస! శూలము పాతితిమి. సిద్ధముగా నుండుము.

కుటుంబిని—అయ్యలారా! రక్షింపుడు. రక్షింపుడు.

చందన—కుటుంబినీ! ఏడువకుము. ఈనీచులను బ్రార్థింపనేల? దేవతలను శరణు వేడుము.

చండాలు—అరే! బిల్వపత్త్రుఁడా! చందనదాసుని బట్టుకొనుము. వీనిపరిజనులు తమయంతనే పోవుదురు.

ద్వితీయచండాలు—అరే! వజ్రలోముఁడా! ఇదిగో పట్టుకొంటిని.

కుటుంబిని—అయ్యా! రక్షింపుము. రక్షింపుము.

అనునంతలో రాక్షసుఁడు వచ్చి

రాక్ష—భవతీ! భయపడకుము చండాలులారా! చందనదాసును విడువుడు.

ఏనేను నశించుచున్న స్వామికులమును శత్త్రుకులమునుం బలెజూచి యూరకుంటినో, మిత్త్రవ్యసనములయందు మహోత్సవములయందువోలె స్వస్థచిత్తుఁడనై యుంటినో, అవమానపాత్త్రమైన యేనాతనువు పెక్కురవధకు గారణమయ్యెనో, అట్టి నామెడయందు మృత్యులోకమార్గ మగువధ్యమాలిక నునుచుడు.

చందన—(కన్నీరు గార్చుచు జూచి) అమాత్య! యేమిది?

రాక్ష—ఇది నీసుచరిత్రమున నేకాంశము నేని బోలునా?

చందన—నాపడిన ప్రయాసమంతయు విఫలము సేసితివి.

రాక్ష—సఖుఁడా! నాపనియె నేను చేసితిని. భద్రముఖుఁడా! చాణక్యునకు జెప్పుము.

వజ్రలోముఁడు—ఏమని?

రాక్ష—తొల్లి పుణ్యమగుకృతయుగమున శిబిచక్రవర్తి చేసినది చిత్రముగాదు. ఇపుడు పాపబహుళమగుకలియుగమున నిట్టిపని చేసినచందనదాసుఁడు నీకుఁ బూజనీయుండైనను నీయనఘుని నాకై యిట్టిదశ నొందించితివిగాన నేను నీకు విధేయుఁడ నైతి నని చెప్పుము.

నావుడు వాఁడు వోయి చాణక్యునకు జెప్పగావిని

చాణక్యుఁడు—జాజ్వల్యమానుఁడగు వీతిహోత్రుని వస్త్రాంతమున నెవఁడు గట్టెను? గాలిని త్రాళ్లతో నెవఁడు బంధించెను? సింహమును బంజరమున నెవఁ డుంచెను? భయంకరమగు సాగరమును చేతితో నీది యెవఁడు దాటెను?

అనుచు వచ్చి రాక్షసుం గాంచెను.

రాక్షసుఁడు చాణక్యు నుద్దేశించి (తనలో) ఇతఁడు దురాత్ముఁడా! లేక మహాత్ముఁడా! రత్నములకు సాగరునిమాడ్కి సకలశాస్త్రములకు గనియైనవాఁడు. అయినను నీతనియందు మచ్చర ముంటచే గుణములకు మెచ్చము. అని యెంచుచుండ చాణక్యుండు వచ్చి రాక్షసునిం గాంచి

చాణక్య—(తనలో) ఈమహాత్మునికై దీర్ఘజాగరముంగలి గించుగొప్పకల్పనలచే నాబుద్ధియు వృషలునిసేనయు నెంతో పరిశ్రాంతి వహించెగదా? (ప్రకాశముగా) అమాత్యరాక్షసా! ఏను విష్ణుగుప్తుఁడను. అభివాదనము సేయుచున్నాఁడ.

రాక్ష—(తనలో) నన్నిపు డమాత్యుఁ డనుట లజ్జాకరము. (ప్రకాశముగా) విష్ణుగుప్త! నేనుచండాలుర నంటితి. గాన నీవు నన్నంటకుము.

చాణ—అమాత్యరాక్షస! వీరు చండాలురు గారు. వీఁడుసిద్ధార్థకుఁడు. వాఁడుసమిద్ధార్థకుఁడు. ఈయిద్దఱు రాజపురుషులే. శకటదాసేమియు నెఱుంగఁడు. నేన వానిచేఁ గపటలేఖ వ్రాయించితిని. అదిగాక యేన యలంకారత్రయ మంపితిని. ఏన జీవసిద్ధిచే నట్లు పలికించితిని. ఏనజీర్ణోద్యానమునకుఁ బురుషునంపితిని. ఏనచందనదాసు నింత శ్రమపెట్టితిని. ఇదియంతయునీతో జంద్రగుప్తునకు సంధానము సేయఁబూని యేన యాచరించితి.

నావిని రాక్షసుఁ డేమిసేయుదునని యోజించునంతలో చంద్రగుప్తుఁడు పరివారముతోవచ్చి చాణక్యునకుఁ బ్రణమిల్లెను.

అంత విష్ణుగుప్తుండు మౌర్యునవలోకించి పూజ్యుం డగునమాత్యరాక్షసునకు నభివందనము సేయుమనియె.

రాక్ష—(తనలో) ఇతఁడు మా కిద్దఱకు ముడివెట్టు చున్నాడు.

చంద్రగుప్తుఁడు.—ఆర్య! నేను చంద్రగుప్తుఁడను. వందనము సేయుచున్నాఁడను.

రాక్ష—రాజా! విజయ మొందుము.

చంద్ర—ఆర్య! మీ యిర్వురు గాపాడుచుండ జగమున నేను జయింపని దేమి గలదు?

రాక్ష—(తనలో) చంద్రగుప్తుఁడు నన్ను వశము సేసికొనుచున్నాఁడు. ఈతని కీవినయము సహజమే. అయినను మచ్చరము విపరీతభావమును దోఁపించెడిని. చాణక్యుఁ డన్నివిధములఁ గీర్తిమంతుఁడు. ఏలన, రాజు గుణవంతుఁ డైనచో నమాత్యుఁడు మందమతియైనను గీర్తి నొందును. రాజు గుణహీనుఁడైనచో మంత్రినీతివిదుఁ డైనను నేటిదరి నున్నవృక్షంబువోలె నిరాశ్రయుండై పడిపోవును.

చాణక్యుఁడు—అమాత్యరాక్షసా! చందనదాసుఁడు జీవించుట నీకిష్టమే యగునా?

రాక్ష—విష్ణుగుప్త! సంశయ మేమి?

చాణ—అట్లేని చంద్రగుప్తునిసచివపదవి నంగీకరించి శస్త్రము గ్రహింపుము.

రాక్ష—విష్ణుగుప్త! ఇట్లు వచింపకుము. మొదల మేము తగము. నీవు పరిగ్రహించిన వానియొద్ద బొత్తుగ నుపయోగింపము.

చాణ—యోగ్యాయోగ్యవిచారము విడువుము. నీభయం
బున నెల్లపుడు సమరసన్నాహమున నుండవలసివచ్చు
టం జేసి నిద్రాహారంబు లెఱుంగక కృశించినచతురంగ
బలంబుం జూడుము. పలుమాట లేల? నీవు మంత్రిప
దవి నంగీకరింపనిచో చందనదాసుఁడు జీవించుట కల్ల.

రాక్ష—(తనలో)

గర్భపతనంబు మొదలు తైలద్రోణులలో నునిచి యేను
బెనుపఁ బెఱిఁగిననందకుమారు లందఱు నంత మొందిరి. వారి
యెడ స్నేహంబుగలిగియు మిత్రరక్షణంబునకై వారివైరికి
భృత్యత్వము గావింపవలసె. కార్యగతి విధికిని దాస్యత నొడ
గూర్చుగదా? (ప్రకాశముగా)

విష్ణుగుప్త! సర్వకార్యనిశ్చయములకు గారణమైనమిత్ర
స్నేహమునకు నమస్కారము. నమ్రుఁడ నైతిని.

చాణ—(హర్షముతో) వృషలుఁడా! నీ వమాత్యరాక్షసు
నిచే ననుగ్రహింపఁబడితివి.

రాజు—మీయనుగ్రహము ననుభవించుచున్నాఁడను. అను
చుండ నొకపురుషుఁడు వచ్చి జయముగుగాక మల
యకేతుడు బంధింపఁబడి రాజద్వారమునకు గొని
రాఁబడియెను. నావుడు,

చాణ—భద్ర! రాక్షసునకు దెలుపుము. కర్తవ్య మాతం
డెఱుఁగును.

రాక్ష—(తనలో) చాణక్యుఁడు నన్ను దాసునిగాఁజేసి వాగిం
పఁబూనెను. ఏమి సేయుదును? (ప్రకాశముగా) రాజా!

నీకంతయు దెలియును. మలయకేతు నొద్దనేను గొంత కాలము వసించితి. కాన వీని ప్రాణములు రక్షింపుము. నావిని చంద్రగుప్తుఁడు చాణక్యునివంక జూచెను.

చాణ—రాక్షసుని కోర్కె దీర్పదగును. అరే! రాక్షసుండు విన్నవింప చంద్రగుప్తుఁ డనుగ్రహించి మలయకేతునకు దన తండ్రిదగు రాజ్యము నొసఁగెను. గాన వారల విడిచి పుచ్చుమని యేఁజెప్పితినని చెప్పుము. ఇంకొక మాట దుర్గపాలునకుఁ జెప్పుము. అమాత్యరాక్షసుఁడు లభించుటచే చంద్రగుప్తుఁడు సంతసించి చందనదాసుని సర్వనగరములలోని శ్రేష్ఠులలో బెద్దశ్రేష్ఠిని గావించెను. ఈతని ద్రవిణము నంతను దిరుగ నిచ్చివేయుమని యానతిచ్చెను. అమాత్యరాక్షసుఁడు చెప్పినట్లు సేయుడు. ఇఁక నాకు గావలసినదేమి? నాప్రతిజ్ఞ నెగ్గెను గాన సిగముడి వేయుచున్నాడను. రాజా! నీకేమిగావలయును.

రాజు—ఇంతకన్నఁ బ్రియమేమి కలదు? రాక్షసునితో మైత్రి కలిగించితిరిగాన రాజ్యము సుస్థిరముగనిల్పితిరి. నందుల నందఱ నిర్మూలించితిరి.

రాక్ష—ఈభూమి తొల్లి ప్రళయోపద్రవము నొంది యాది వరాహమూర్తి దగు దంష్ట్రనాశ్రయించెను. ఇప్పుడు మ్లేచ్ఛులవలన భీతినొంది రాజరూపుదాల్చిన యద్దేవు భుజయుగమున నిల్చెను. చంద్రగుప్తుఁడు చిరకాలము

పుత్రమిఁ బాలించుగాక, యని రాక్షసుఁడు చంద్రగుప్తునకు నమాత్యుఁడై రాజ్యతంత్రము నిర్వహించుచుండెను.

చాణక్యుండు బుద్ధిబలంబున నవనందుల నంతమొందించుటయకాక యిట్లు నందరాజమంత్రియగు రాక్షసుని నిగ్రహించి వశపఱచుకొని చంద్రగుప్తుమంత్రిపదవి నంగీకరింపఁజేసి చంద్రగుప్త రాజ్యమును సుప్రతిష్ఠితము సేసెను. నాటంగోలె చాణక్యుఁడు జగద్విఖ్యాతి గాంచెను.

శి వ ము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# యుగంధరుఁడు.

---

## ప్రథమప్రకరణము

## ప్రతాపరుద్రగ్రహణము.

---

శ్రీసన్నివేశ మగునాంధ్రదేశమునకుఁ దొల్లి యేకశిలా (వరంగల్) నగరము రాజధానిగా నుండెను ఆపత్తనము సకలకలావిదు లగుబుధజనులకు నిలయమై త్రిదశాలయమును దలపించుచుండెను. ఆపురవరము సకలవర్ణపరిపూర్ణమగుట నెల్లజనులచిత్తంబులకుఁ జిత్రవిభ్రాంతి నొసఁగుచుండెను. ఆపట్టణంబుగోటలు నేటికినిఁ జూపరులకు నచ్చెరువు గలిగించుచుండ నాటిసౌభాగ్యంబు నేమని వర్ణింపనగును? కాకతిరాజవంశమౌక్తికాయమానుం డగుశ్రీవీరప్రతాపరుద్రనరపతి యానగరంబు రాజధానిగా నాంధ్రరాష్ట్రమును బాలించుచుండెను. ఆజనపాలు నన్వర్థనామము వినఁబడగనె వైరినృపాలురకు సంతాపంబు దుర్భరం బగుచుండెను.

వరంగల్ నగరపరిసరంబున నిప్పుడును గడునొప్పిదము గలిగి యలరారుచున్న వేలకొలఁది సహస్రస్తంభమండితంబు లగుమండపరాజంబులును దేవాయతనంబులును నానరనాథుని దేవభక్తిని వేనోళ్ల వెల్లడించుచున్నవి. ఆరాజమార్తాండునితేజంబునకు వెఱచి కాటకంబు తమంబు విదేశంబులకును నధర్మ

ఘూకంబులు యవనభూములకును బఱచెను. ఆక్షమాధవుండు నరరూపుదాల్చినప్రత్యక్షమాధవుండె యనియెంచి శ్రీదేవి యాతనియెడఁబాటున కోపదయ్యెను.

ఆభూజానిసన్నిధి శివదేవుఁడు యుగంధరుఁడు నున్నగు వారు మంత్రులుగా నుండిరి. వీరిలో శివదేవుఁ డనారతశివభావనాపరుఁడు. అందరు రాజనీతివిశారదు లైనను యుగంధరుఁడప్రతిమప్రతిభాశాలియగుటం జేసి ప్రధానామాత్యుఁడుగానుండెను. ఈమంత్రిపుంగవునిమంత్రశక్తి యనుజంఝూమారుతంబుసాహ్యాంబున శ్రీప్రతాపరుద్రదేవునిప్రతాపానలంబు శత్రుపక్షకాననంబుల భస్మీకరించుచుండెను. ఆభూనాథుండు యుగంధరోపదిష్టనీతిమార్గంబున నిష్కంటకంబుగ రాజ్యంబు బాలించుచుంత నాంధ్రభూజనులు సకలసుఖంబులకు భాజనులై యీతిబాధలన నెట్టివో యెఱుంగరైరి.

ఆకాలమున ఢిల్లీపురమును బాలించుచున్న గయాజుద్దీన్‌టోఘ్లక్ సుల్తాను ప్రతాపరుద్రుని జయించి యాతనివలన గప్పంబుగొననెంచి పెక్కుమారు లపరిమితతురుష్కబలంబుల నేకశిలానగరంబు ముట్టడింప నంపియు నాబలంబంతయు వీరరుద్రునిప్రతాపాగ్నియందు శలభపటలంబుపోల్కి నశించిన వార్తలాలించి తనచిత్తంబు శోకాయత్తంబు గావించుకొని యుండెను.

వైరిభయంబు లేమింజేసి యేకశిలాధీశుండు రాజ్యభారంబు మంత్రులయందునిచి యొకప్పుడు ధర్మవ్రతపరుం డగుచును వేరొకప్పుడు గామోపభోగరసికుం డగుచును ఇంకొక

ప్పుడు పండితకవిగోష్ఠీపరినిష్ఠుం డగుచును మఱియొకప్పుడు మృగయావినోది యగుచును వర్తించుచుండెను. అట్లుండ నొ కయదనున యుగంధరుండు దక్షిణపుణ్యక్షేత్రదిదృక్షాయ త్తచిత్తుండై వెడలిపోయెను.

ఢిల్లీపురాధీశుండు పలుమఱు కాకతీయనరపాలునివలన నపజయంబు నొందియుండుటం జేసి సమయంబు వేచుచుండి వేగులవారివలన యుగంధరుండు రామేశ్వరయాత్ర కరిగెనని విని ప్రతాపరుద్రుని జయింప నిది మంచియదనని యూహించి యపరిమితసేనానివహంబు నొసఁగి కొందఱ దండనాథుల నే కశిలాపురి కనిచెను.

యవనసేనాపతులు వరంగల్ నగరసమీపప్రదేశంబు సేరి ప్రతాపరుద్రనరపతి తఱచుగ మృగయావినోదంబున నుం డునని వినియున్నవా రగుటం జేసి యడవులయం దెట నేని నీ భూమీశుండు దొరకునో యనునాశచేఁ జారుల నచ్చటచ్చట వెదుక నంపిరి.

అప్పు డేకశిలాదీశుండు పాకాలచెఱువు జుట్టుకొని యున్నమహారణ్యంబు క్రూరమృగశరణ్యం బగుట నాటవికసే నలంగూడి యటకుఁ వేటకుఁజనియుండెను. రాజన్యుం డందుం డెనని చారులవలన విని యవనసేనాపతు లచ్చేరువఁజేరి సమ యము సూచుచుండిరి. ఆంధ్రమహీశుండు మృగయాపారవ శ్యంబున శార్దూలంబుల మర్దించియు వనకుంజరంబుల భజిం చియు నెమళులం బట్టియుఁ జమరులం గొట్టియు నభిమతక్రీడల విహరించి పరిశాంత్రుండై యచ్చేరువం గలచెఱువుదరి సేరి

యందలిజలమునంగ్రోలి గట్టునఁ బరిచరులు పఱచినతలిరుసెజ్జ పై పిశ్రమించి యధికంబుగఁ బరిశ్రాంతి నొందుటనో దైవ యోగంబుననో నిద్రానిమీలితలోచనుం డయ్యెను. రాజునొద్ద నిరుముగ్గురు నిజభటులుఁటచే నాటవికులు దమతమ నెలవులకుం జనిరి. అయ్యది దగుసమయమని గ్రహించి తురుష్కదండ నాథు లాసరనాథుని బంధించి వశపఱచుకొని పయనంబు నాగించిరి. అట్లు వారు దన్ను బంధింపగనే మేల్కని యాంధ్ర భూమీశుండిట్లని చింతించెను.

ఆహా! ఏ నెంతతుచ్ఛపుపని సేసితి, వేట దుర్వ్యసనం బని యెఱింగియు నిందుదవిలి మోసపోయితి. ఇపుడు నాకు దిక్కె వ్వఁడు? మహామంత్రియుగంధరుండు నగరంబుననైన లేఁడు. ఏను దీర్థంబుల సేవించి నగరంబు సేరుదనుకనైన వేట మాని యుండుమని యామహాభాగుఁడు చెప్పినయుపదేశంబు బెడచె విని బెట్టినయీ వెడగునకు నిడుమ లెట్లు రాకుండును? స్వ యంకృతంబు లగునపరాధంబులకు వానిఫలం బనుభవించుట కన్న వేరొండుప్రతీకారంబు లేదుగాన నాకీయాపద శోకదంబు గాదు. కాని దుర్వ్యసనాసక్తుండ నగునాకతన దేశమెల్ల మల కలపాలై యిక్కట్టులకు గుఱియౌనో యని నాడెందంబు తల్లడి ల్లుచున్నది. అకారణవత్సలుం డగుపరమేశ్వరుండు దుష్కర్మర తుండ నగునన్నుదురుష్కులనశంబు సేసినను మదీయదేశంబు దద్వశంబు గాకుండ రక్షించుఁగాత అని పరితపించుచుండెను.

---

## ద్వితీయప్రకరణము.

### యౌగంధరప్రతిజ్ఞ

విద్యానాథుం డనునొకకవినాథుఁడు ప్రతాపరుద్రీయ మనునొకయలంకారగ్రంథము రచించి ప్రతాపరుద్రుని దర్శించుకుతుకంబున నేకశిలానగరంబునకు వచ్చి భూకాంతుఁడు మృగయావినోదియై యడవులలో నున్నాఁడని జనులవలన విని విపినంబునకేగి యందందు నెముకి తేఁడు యవనచమూపతులచేఁ బట్టుకొని పోఁబడియెనని యాటవికులు దెలుప మలకదండు వెంబడి బడియేగుచు సేనాపతులు నౌకాధిరోహణంబు సేసి గోదావరి దాటుచుండ నిందు భూనాథుం డుండునని యోజించి యానది నీఁదుచు నయ్యోడదాపునకుఁ బోయి మొసళ్లు బట్టవచ్చె ననుంగావుడని నావికులం బ్రార్థించెను. అప్పు డందున్న సర్దారు లీ జనుని నావలోనికి నందుకొనుఁడని యనుమతింప నావికు లామహీసురునకు నొక వేణుదండము నందిచ్చిరి. కవీంద్రుం డద్దాని బట్టికొని యందుఁ జేర నందున్నవారు నీవెవ్వఁడవు? ఏటిలో నేలపడితివి? అని యడుగ నాయనఘుం డిట్లనియె.

అయ్యా! ఏనొక బీదపాఱుఁడను. నాభార్యకు సన్నిపాతవ్యాధి సంభవించుటచే వైద్యునికై యేటిగట్టున నున్న నొకగ్రామంబు వోయి యట మందు గైకొని వచ్చునంతకు నిందు పడవ యేదియు లభింపదయ్యెను. ఆలసించినచో నేమి యాపద మూడునో యని యీది పోనెంచి యేటఁబడితిని.

మొసళులు వెనుదవులుటం జేసి వానిబారినుండి తప్పించుకొన నేరక యాక్రోశించి మీాయనుగ్రహంబున నిందు జేరితి. శీత జ్వరబాధచే వడకుచున్నాఁడ నని తెలుప నందున్న సేనానులు నావలోపలి కేగి యందుఁ బండుకొమ్మని పలికిరి.

ఆవిద్వత్కంఠీరవుండు లోని కేగునంత మహారా జచ్చటనే యుండెను. ఆయనమహాపురుషలక్షణంబుల దిలకించి యీాయనఘుఁడే కాకతిప్రభువుగా నుండునని యోజించి తడసియున్న తాళపత్రగ్రంథమును దుడువ నారంభింప నప్పుడు వారిర్వురకు సంభాషణ మిట్లు జరిగెను.

ప్రతాప—అయ్యా! ఈగ్రంథము పేరేమి?

విద్యానాథుఁడు—ప్రతాపరుద్రీయ మనునలంకారశాస్త్రము.

ప్రతా—దీని కీపే రేల వచ్చెను?

విద్యా—దీని నారాజునకు నంకిత మొనర్చితిని.

ప్రతా—సమ్మానము జరిగెనా?

విద్యా—దర్శనమే లభింపదయ్యెను.

ప్రతా—ఏమికారణము?

విద్యా—రాజుగారు నగరములో లేరట!

ప్రతా—అట్లేని నీగ్రంధమును వేరొకని కేల యంకితము సేయఁగూడదు?

విద్యా—అట్టియవకాశము లేదు.

ప్రతా—కారణమేమి?

విద్యా—గ్రంథమునం దంతటను నాతనిపేరె తగులఁబెట్టితి గదా ?

అని వచింప నాగ్రంథమునఁ బ్రతిశ్లోకమునను దనపేరు సేర్చెననియు నద్దాననే వేరొకని కంకితముసేయ నవకాశము లేదనియు గ్రహించి యట్టిమహాకవికిఁ దగుసమ్మానము గావించు భాగ్యము లేమికి జింతించి యాయానవలన గొన్నిపద్యముల వినియానంద మొంది యాకవీంద్రునకుఁదనముద్రాంగుళీయకము నొసంగెను. ఆవిదుండా యంగుళీయము గ్రహించి యందున్న నామాంకము గాంచి సంతసించి యచిరకాలమున బంధవిముక్తి నొందుదువని దీవించి తేనిచే ననుమతుండై యోడ మీాది కరుదెంచి మందు నీటిలోఁ బడి పోయెనని మిషపన్ని యేటదుమికి యొడ్డుసేరి యేకశిలాపురి కరుదెంచెను. యవనసేనానులు ఢిల్లీ నగరముసేరి ప్రతాపరుద్రునిఁ జెఱలో నునిచిరి.

అట యుగంధరుండు ఢిల్లీశ్వరునిదురుద్యమంబు తెలియగనే మరలి యేకశిలాపురము బ్రవేశించి యేకాంతంబున మంత్రులతో నాలోచించుచుండ విద్యానాథుండు తనరాక దెలిపి ముద్రాంగుళీయము నిచ్చెను. అప్పు డామంత్రివరుండు కవినాథుని సాహసంబున కెంతయు సంతసించి, యవనులు తేనింగొనిపోయిరనువార్త వెల్లడింపకుడని చెప్పి భూనాథుండు సిరిపురమున నొకగేస్తునింట వ్యాధిగ్రస్తుండై యున్నట్లు లేఖం దెప్పించి యొకరజకునకు రాజవేషము దాల్పించి యవ్వానినటనుండి రప్పించి భూకాంతుండు ఘోరమృగఘాతంబుల నస్వస్థగాత్రుండుగాన గొన్నాళ్ళదనుక తేనిదర్శన మన్యులకు

లభింపఁదసియు, మ్లేచ్ఛసేనాపతులు రాజవేషధారి యగు రజకుని జూచి రాజని భ్రమించి ఢిల్లీకి గొంపోయిరనియు, బ్రికటించి యేకాంతంబున నిట్లు ప్రతిన సేసెను

ఆఱునెలలలోపలఁ బ్రతాపరుద్రునిఁ జెఱ విడిపించుటయెగాక ఢిల్లీ సుల్తానును జెఱఁగొని రాజాలనేని నేను యుగంధరుఁడనుగాను. అని ప్రతిజ్ఞ సేసి తగువారి సర్వకృత్యముల యందు నియోగించి తగువారితోఁగూడి తాను ఢిల్లీనగరమునకు నరిగెను.

---

త్రుతీయ ప్రకరణము.
ప్రతాపరుద్ర మోక్షము.

---

అంత యుగంధరుం డున్మత్తవేషమున ఢిల్లీపుర వీధుల యందు దిరుగ నారంభించెను. మొలను గోచియు, బుజమున గొంగడి చింపియుఁదాల్చి యొక తాటియాకులాగుచు

"ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతా
మూడే నెల్లాకు పట్టుకపోతా"

అని కేకలు వేయుచు నతఁడు వీధులలోన దిరుగుచుండ నీవృత్తాంతము సుల్తాను విని యిద్దఱుభటులను బిల్చి వీఁడు నిజముగా వెఱ్ఱివాఁడో, లేక కపటవేషధారియో, బాగుగా నరయుడని యానతిచ్చి యనిచెను. దానం జేసి వార లాయన వెంబడి దిరుగుచుండిరి.

మంత్రి యుగంధరుని మిత్రులు గొందఱు ఢిల్లీనగరము ప్రవేశించి కొన్ని జనాపవాదములు గలిగించిరి. యవనసైనికు లడవులలోఁ బ్రతాపరుద్రుని వెదకుచున్నారని తెలిసికొని యాంధ్రమంత్రులొక రజకునకు రాజవేషము వైచి యడవికిఁ బనుపగా నామర్మము దెలిసికొనఁజాలక వీరు రజకుని గొని వచ్చిరని వెల్లడించిరి. మఱియును సుల్తానునకు సేనానులకును సేనాపతులలో నొకఱొకళ్ళకునుఁ బరస్పరద్వేషకరము లగు నైతిహ్యములు గల్పించిరి. దానం జేసి తురుష్కరాజ్యాంగము మేడిపండు దగు మేలిమిం బోలియుండెను.

అంత గొన్ని దినంబులకు ఢిల్లీనగరపరిసరంబున నున్న యమునరేవునకు నొక యోడవచ్చెను. దానినుండి కొందఱు రత్నవర్తకులు వచ్చి నజరుల నర్పించి సుల్తానుం దర్శింప నపుడు వారికిట్లు సంభాషణము జరిగెను.

సుల్తాను—మీది యేదేశము ?

వర్తకులు—మాది గోవాదేశము.

సుల్తాను—మీ వ్యాపార మేమి ?

వర్త—మాది రత్నములవ్యాపారము.

సుల్తాను—మీరు మావద్ద కెన్నడును వచ్చినవారు కారు. ఇప్పు డేలవచ్చితిరి?

వర్త—మే మిదివరకు వరంగల్ ప్రతాపరుద్రమహారాజువారి యొద్ద కేగి రత్నములను వారికి విక్రయించుచుంటిమి. ఇప్పుడు వారు చనిపోయినందున నిటకు వచ్చితిమి.

సుల్తా—(సేనాపతినిజూచి) వలీఖాన్! వీ రిట్లు పలుకుచున్నా రేమి?

వలీఖాన్—రాజును మనము బట్టుకొనివచ్చిన కతన వారు కనబడమిచేనా దేశమున నట్లు వాడుక గలిగియుండనగు.

సుల్తా—(వర్తకులనుజూచి) రాజు లేకున్న యుగంధరుఁడు లేడా ?

వర్త—ఆయన రామేశ్వరముననె మృతినొందెనట!

సుల్తా—మీరత్నము లేవి?

వర్త—ఇవిగో మహారత్నములు.

సుల్తా—(వానినిఁ జూచి మెచ్చుకొని) వీనిలో నొక్కదానివెల చెప్పుము.

వర్త—వీనివెలలను మేము చెప్పునాచారము లేదు.

సుల్తా—ఇఁక నెట్లు?

వర్త—రాజసన్నిధిలో దెలిసినవార లేర్పరచినధరలనే మే మంగీకరింతుము.

సుల్తా—మీరు వరంగల్ పోయినప్పు డచ్చట వీనివెలల నెవ్వరు నిర్ణయించుచుండిరి?

వర్త—ప్రతాపరుద్రమహారాజుగారు స్వయముగా నిర్ణయింతురు.

సుల్తా—వీనివెలలు వారికిఁదెలియునా?

వర్త—వారికన్న దెలిసినవార లీలోకమునె లేరు.

అని పలుకగా విని రహస్యముగా

సుల్తా—వలీఖాన్ ! ప్రతాపరుద్రుని నిటకు గొనిరమ్ము.

వలీఖాన్—మహాప్రభూ! మనయందు గ్రోధముచే నతఁడు వెల లధికముగా నిర్ణయించునేమో ?

సుల్తా—రత్నములకుఁ దక్కువవెలలు వేయుదువేని వరంగల్ కోటకు నిన్ను శీఘ్రముగా ననుపుదు మని యాశ వెట్టి షరాబువేషము వేయించి యిటకు గొనిరమ్ము. నావుడు వాఁడు వోయి ప్రతాపరుద్రుని సుల్తానుసన్నిధికిఁ జేర్చెను.

సుల్తా--రాజా! ఇటగూర్చుండుము. ఈవర్తకులురత్నములను గొనివచ్చిరి. వీనివెలలు తీర్మానింపుము.

ప్రతాపరుద్రుఁడు—(ఆరత్నములను గాంచి యయ్యవి తన భాండాగారములోనివే యని గ్రహించి) ఈరత్నమేఁబదిలక్షలవరాలును, ఆరత్న మెనుఁబదిలక్షలవరాలును సేయును.

సుల్తా—ఈవెలలు మీకు సరిపడినవా ?

వర్త—మీషరాబుగారు వీనివెలలు చాల తగ్గించి చెప్పిరి. అయినను నేమి సేయుదుము? మీకన్న గ్రహింపఁగలవార లింకొక్కరీదేశమున నేలేరు. ఇంత కెక్కువైనమహారత్నము లెన్నియో యోడయందు గలవు. గాన మీరచ్చటికి విచ్చేసి వానిం దిలకించి మీయిచ్చవచ్చిన వానిం గ్రహింపుడు.

సుల్తా— రేపటిదినమున నచ్చ్లె రాగలము.

నావిని వారు నావకుఁ జేరిరి.

ఆమరునాఁడు ఢిల్లీసుల్తాను రత్నములఁ జూచుకుతుకంబున గొందఱు సర్దారులతోను ప్రతాపరుద్రునితోను నోడకుఁ జని యందుఁ బ్రవేశించి దాని వైశాల్యమును, వైచిత్ర్యమును సూచుచుండ గొంతకాలంబును, అపరిమితం బగురత్నజాతంబు గాంచుచుండ గొంతవేళయు గడచెను. అపుడు వర్తకు లల్పాహారము విందు సేయుఁడని సుల్తానుం బ్రార్థింప నాతఁడు జిహ్వాచాపలంబు ప్రభావంబున నియ్యకొనెను. అంత వారు సిద్ధపఱచిన మత్తు వస్తువులను సుల్తానునకు సర్దారులకు నొసఁగిరి. నావికులోడను నడుపసాగిరి. ఢిల్లీశుండు సేనాపతులతోగూడ నల్పాహారము గ్రహింపగనే యొడలు మఱచి పడిపోయెను. అత్తఱి నందు డాగియున్న యాంధ్రభటులు సర్దారులతోగూడ సుల్తానుం గట్టివైచిరి. నావికు లాయోడను యమునమీఁదుగా గంగానదినిఁ గంగనుండి సాగరంబును జేర్చి బృందావన పురతీరంబున నిలిపి యట సిద్ధపఱచిన శకటంబులవలనఁ గ్రమంబుగ ఢిల్లీశునితోగూడ ప్రతాపరుద్రుని నేకశిలానగరము చేర్చిరి. ఈ విధంబున మహామంత్రి యుగంధరుండు నీతికౌశలంబున యవనులను బరిభవించి ప్రతాపరుద్రుం నోరుగల్లునకుఁ జేర్చెను. అప్పుడు ప్రతాపరుద్రమహారాజు యుగంధరుని పాదంబులకుఁ బ్రణమిల్లి యిట్లు విన్నవించెను.

మంత్రిసత్తమా! ఏను నీమాట వినక వేటందవిలి రాజ్యభ్రష్టుండ నగుటయగాక శత్రుహస్తగతుండ నైతి. అట్టి నన్ను నీవు నాపాలిటి దేవుండవై గాచితివి. నీమంత్ర

శక్తిచే సురక్షితంబగు నీసామ్రాజ్యంబెగాక యట్టిదెయగు నాశరీరంబును నీయదియ. ఇట్టినీకు నేనేమి సేయఁగలను ? జీవితకాలమెల్ల పరమేశ్వరుంబలె నిన్ను ద్రిశుద్ధిగా నర్చించుచుండుదు. ఏను ప్రమత్తుండనై నీమాట నుజ్జగించి మిమ్మిట్లు పరిశ్రాంతు గావించిన నేరము క్షమియింపుము. అని మంత్రివరు పాదములమీదఁ బడియెను.

అంత నామంత్రివరుండు రాజును లేవనెత్తి మహా రాజా! నీచేసిన నేరమేమి? దైవవశంబున సుఖదుఃఖంబులు గలుగుచుండును. అదిగాక, నివింటనే యున్నచో నామంత్రి శక్తి యెట్లు లోకవిదిత మగును? నీచేఁ బోషింపఁబడు మేము నీకు నిక్కట్టు వచ్చినప్పుడు శ్రమింపకున్న మావలన నేమి ప్రయోజనము ? మనసంకల్పసిద్ధికి శివదేవు ననుగ్రహము మూలము. పరమేశ్వరు ననుగ్రహమున నాపద నిస్తరించితివి. శత్రుల జయించితివి. తొల్లింటివోలె రాజ్యభారంబు వహించి దుర్వ్యసనంబులం దవులక ధర్మంబునఁ బ్రజలం బాలింపుము. విద్యానాథమహాకవిని బహూకరింపుము. భగవానుని దయచే నెల్లరు సకలసుఖములఁ బడయుదురుగాత యని బోధించెను.

అది మొదలుకొని శ్రీవీరప్రతాపరుద్ర నరపతి యుగంధరునకు సమ్మతముగాఁ బుడమిం బెక్కుకాలము శాసించి దిగంత విస్ఫూర్తిగల మహాకీర్తి నార్జించెను.

---

శ్రీ
శివాభ్యాంనమః

# తిమ్మరుసుమంత్రి.

## ప్రథమప్రకరణము.

### మంత్రిపదప్రవేశము.

చ॥ కరచరణాదులందఱకు గల్గినయంతటనే సమర్థతన్
మెఱువడి గాంచనేర్తురొ మనీషివరుల్ ధరలోన నెవ్వరి
క్కరణి ఘటింపుచుం గృతయుగంబునఁ ద్రేతను ద్వాపరంబునం
దరయగ సాళ్వ తిమ్మసచివాగ్రణికి న్సరిమంత్రి గల్గునే?
(కుమారధూర్జటి)

### ఈమంత్రివంశము.

ఈమంత్రివరుఁ డార్వేలనియోగిబ్రాహ్మణశాఖలోని వాఁడు. ఈయనపూర్వులు సాళ్వవంశ్యులైన రాజులయొద్ద మంత్రిపదవులలో నుండువారగుటం జేసి వీరివంశమునకును సాళ్వసంజ్ఞ గలిగియుండెను. ఇతఁడు వేమరాజునకుఁ బౌత్రుండును రాచిరాజునకుఁ బుత్రుండును నగును. ఈయనకు తిమ్మరాజని పేరు. కన్నడభాషలో అరసుశబ్దము రాజశబ్దమునకు బర్యాయపదము గాన తిమ్మరుసను పేరు వాడుకలో నుండెను. ఈయమాత్యునకు గోవిందరాజను తమ్ముఁడు గలఁడు. ఈయన జన్మస్థానము చంద్రగిరి. తిమ్మరుసు క్రీ. శ. ౧౪౬౦ సంవత్సర

ప్రాంతమున జన్మించియుండెను. ఈయన బాల్యమునందే తలిదండ్రులు స్వర్గస్థులైరి.

## విద్యాభ్యాసము

ఈసోదరులు పరస్పరానురాగభరితులై గురుశుశ్రూషాపరత్వమున వింశతివత్సరములతిక్రమించునంతకు సంస్కృతాంధ్రములయందుఁ బాండిత్యమును, గణితవిద్యయందు నైపుణ్యమును నార్జించి ప్రఖ్యాతిగాంచిరి. అయినను వీరికి రాజనీతి గఱచునెడఁ గరము గుతూహలముగలిగియుండెను.

ఆసమయమున వృద్ధుఁడైన నాదెండ్ల చిట్టిగంగనామాత్యుఁడు రాజనీతివిశారదుఁడై చంద్రగిరిరాజ్యమును బాలించుచున్న సాళ్వనరసింహరాజునకుఁ బ్రధానామాత్యుఁడుగానుండెను. ఆసోదరు లీమంత్రివరు నాశ్రయించిరి. చంద్రగిరిరాజ్యమునకు నారాయణవనము రాజధానియగుటం జేసి గంగనామాత్యునకు నదియె నివాసమయ్యెను. ఆమంత్రివరుఁ డీసోదరులను తన దివాణమున లేఖకులనుగా నునిచికొని వీరిప్రజ్ఞావిశేషముం బరికించి వీరురాజనీతివిద్య నభ్యసించునెడ నభ్యుదయము నందఁగలరని గ్రహించి యొక్కనాఁడు తిమ్మరాజుం దన యింటికి రప్పించి యేకాంతంబున నిట్లనియెను.

ధీమంతుఁడా! నీప్రతిభ స్పృహణీయముగా నున్నది. నీ పూర్వులు మహామంత్రులై ప్రఖ్యాతిం గనియున్నవారు. ఏను వృద్ధుఁడ నైతిని. నాకు విదితంబగు రాజనీతివిద్య సర్వంబు నీకు గఱపెద. కాని సనాతనధర్మరక్షణార్థమె ప్రతిష్ఠాపిత మైన

యీసామ్రాజ్యము పరాధీనము గాకుండ గావవలయు నను మాట మఱువకుండవలయు.

నేటి రాజ్యాంగపరిస్థితు లెట్లున్నవో గమనింపుము. సంగమరాజవంశంబున బుద్ధిహీనులు వొడమి సామ్రాజ్యంబు బాలింపఁజాలకున్నారు. బెడందకోటసుల్తాను కర్ణాటరాజ్యంబు గబళింపఁ జూచుచున్నాఁడు. ఒడ్డెరాజగు పురుషోత్తమ గజపతి విజయనగరసామ్రాజ్యంబుమీఁదికి దండయాత్ర లొనరించుచున్నాడు. ఈప్రభుత్వమును దక్షిణహిందూస్థానమున బలపఱుప నెంచి యీసాళువనరసింహానరపతిని విజయనగర సామ్రాజ్యమున నభిషిక్తునిఁ జేయ దృఢసంకల్పముతోఁ బలునాళ్లనుండియు బ్రయత్నించుచుంటినిగాని నాకోర్కి నెఱవేరదయ్యెను. దక్షిణభారతభూమియవనాక్రాంతము గాకుండునట్లు గాచుట ముఖ్యకర్తవ్యము. ఈమహాకార్యమునకు గడంగుదు నని నీవు వాగ్దానము సేసినచో నీకు రాజనీతిమర్మంబుల బోధింతు నన విని యమ్మహానీయునకుఁ దిమ్మరా జిట్లని విన్నవించెను. మంత్రిశేఖరా! ఇంతకన్న నవశ్యకర్తవ్య మేమి కలదు? ధర్మరక్షణార్థమగు హైందవసామ్రాజ్యస్థాపనము నెడ నాజీవితము వినియోగింతును, రాజనీతిని సమర్మకముగా దెలిపి యనుగ్రహింపుము. అన విని యామంత్రిపఠ్యుఁడు రాజనీతివిద్య సరహస్యంబుగా నేర్పెను.

ఆకాలమున తుళువయీశ్వరరాజకొమరుఁ డైన నరసరాజు సాళువగుండయనారసింహానరనాథునకు సేనాధ్యక్షుఁడై తదనుమతింబున గుత్తినగరము నేలుచుండెను. ఆనరసరాజు

తిమ్మరుసుమంత్రిదగు ప్రతిభావిశేషము నాలించి యాయనను దనకు ముఖ్యమంత్రినిగాఁ జేసికొనియెను. తరువాత గంగనామాత్యుఁడు పరలోకమున కేగెను.

## ద్వితీయప్రకరణము.

### విద్యానగర సామ్రాజ్య సంపాదనము.

తరువాత నొక రాజకీయవిప్లవము సంప్రాప్త మయ్యెను. కర్ణాటరాజ్యమును బాలించుచున్నయిమ్మడి విరూపాక్షరాయలు దుర్మార్గగామి యగుటంజేసి జనకంటకుఁడై రాజ్యతంత్రము నడుపఁజాలకుండెను. అది గ్రహించి సామంతులు స్వతంత్రులైరి. దీనింబట్టి వీని జ్యేష్ఠపుత్రుఁడు జనకుని సమయించెను. వానియనుజుం డన్నను దునిమి తాను ఱేఁడయ్యెను, కాని వీఁడును దండ్రియె మేలనిపించువాఁడే యగును.

అప్పుడు తిమ్మరుసు విద్యానగర సామ్రాజ్యవిప్లవముం దెలిసికొని గురుండగు గంగనామాత్యుని యుపదేశముం దలంచి యిట్లు యోజించెను. ఇప్పు డుపేక్షించు నెడ విజయనగరసామ్రాజ్యము యవనులవశమగును. దానంజేసి హైందవ సామ్రాజ్యంబుతో సనాతనధర్మంబును నశించును. అని యోజించి నరసారాయనింగాంచి నరేంద్రా! విద్యానగరపరిస్థితి నాలించితివిగదా? ఈరాజ్యంబు యవనాక్రాంత మగునేని మనరాజ్యంబెగాక మనమతంబును నంత మొందును, గాన నాలసింపక యీకర్ణాటరాజును దొలగించి మనసాళ్వనరసిం

హాభూపాలుని విద్యానగరసింహాసనమున నిలుపుదము. ఇట్లు గావించి హైందవసామ్రాజ్యము నుద్ధరింతమని బోధించెను.

అద్దానికి నరసరాజు సమ్మతించి యవ్వార్త సాళ్వనరసింహరాజునకుఁ దెలిపితదనుమతి సేనల నాయత్తంబు సేసికొని తిమ్మరుసుంగూడి వెడలి విద్యానగరంబు సేరెను.

నరసింహరాయనికీర్తి యంతటను విదితమైయుండుటచే తత్సేనాపతి యైన తుళువనరసరాజు నెదుర్కొన నచ్చటిదండనాథులలో నెవ్వారును సాహసింపరైరి. దానం జేసి నగరమునకు నష్టముగలుగకుండునట్లు నరసరాయఁడా పురము ప్రవేశించి రాజభవనము సమీపింప విద్యానగరాధ్యక్షుఁడైనప్రౌఢదేవరాయలు దిడ్డివాకిట వెడలి పురంబు విడిచి పరుగిడెను. అంతట నరసారాయఁడు రాజభవనంబు ప్రవేశించి యాయుభాగారములు లోనగునవి వశపఱచుకొనెను.

తరువాత తిమ్మరుసుమంత్రి సాళ్వనరసింహక్షితీశుని రప్పించి పట్టాభిషేకము గావించెను. నరసింహరాయఁడు పరలోకగతుఁడైనపదంబడి యాయన పెద్దకుమారుఁడైనతిమ్మరాయడు బాలుఁడైనను నాతనినే పట్టాభిషిక్తునిఁ జేసి నరసరాయనిసాహాయ్యంబున రాజ్యభారము నిర్వహించుచుండెను. అది సహింపక యొకసేనాపతి రహస్యముగ బాలరాజునుఁ జంపించి నరసరాజె రాజ్యలోభమున నట్లుసేసెనని యపనింద గలిగించెను. దీనికిఁ బ్రతివిధాన మేమని నరసరాయఁడడుగ తిమ్మరు సిట్లనియె. శత్రుని నణఁచు తెఱఁగు పిమ్మట నాలోచిం

తము, తొలుత నరసింహారాయని ద్వితీయపుత్రుఁడగు నిమ్మడి నరసింహారాయఁని బట్టాభిషిక్తునిఁ జేసి యపయశంబు వాపి కొనుమని చెప్పి యట్లు సేయించెను.

పిమ్మట నాసేనాపతి యీయిర్వురపై మచ్చరంబున నిమ్మడి నరసింహారాయనితో మైత్రినార్జించికొని వీరల: వెడల గొట్ట యత్నించెను. అది గనిపట్టి తిమ్మరుసుమంత్రి కపట మిత్రునితో మైత్రి విడుమని యొంతజెప్పినను నాతఁడు విన కున్న నరసరాయనితోగూడ పెనుగొండ కేగి బహుళసైన్యం బులతో విద్యానగరము ముట్టడించి స్వభ్రాతృహంతకుఁ డగు దుర్మిత్రుని శిక్షించెదో లేక రాజ్యంబు విడిచెదో తెలుపుమని వార్తనంపి నిర్బంధింప నతఁడు సేయునదిలేక దుష్టసేనాపతిని జంపించి యాతనిశిరము నరసారాయనియొద్ద కంపెను. అంత నిమ్మడి నరసింహారాయని నటనుండి తొలగించి వేరొకదుర్గం బున :నునిచి నరసారాయఁడే కర్ణాటకరాజ్యంబు బాలించు చుండెను.

అప్పుడు కొందఱకుఁ బ్రిథమకర్ణాటకరాజవంశమునను మఱికొందఱకు సాళువనరసింహారాజువంశ్యులయందును బక్ష పాతము గలిగియుండెను. తిమ్మరుసుమంత్రికి వారియెడ ద్వేషము లేదుగాని భారతదేశము హైందవులవశమున నుం టయే ముఖ్యమని యుద్దేశము కలదు. పూర్వరాజవంశ్యుఁడే కావలయునని వానికే పట్టముగట్టితిమేని వాఁడసమర్థుఁ డగు నెడ సామ్రాజ్య మంతరించును. రాజు తనమాట విననిచో మంత్రి యెంతటినేర్పరియైన నేమిసేయఁగలఁడు? అని యెంచి

యీమంత్రివర్యుఁడు నరసరాయనినే సార్వభౌముని గావించి సాళువ యిమ్మడి నరసింహరాయనిని పెనుగొండ దుర్గమున నునిచెను.

తుళువనరసారాయనికి తిప్పాంబ, నాగాంబ, ఓబాంబ లనిముగ్గురు పత్నులుండిరి. ఈయనుకు తిప్పాంబయందు వీర నరసింహరాయఁడును, నాగాంబయందు కృష్ణదేవరాయఁడును ఓబాంబయందు నచ్యుతదేవరాయఁడు రంగరాయఁడును నిట్లు నల్వురు కుమారులు గలిగిరి.

నరసారాయనికి ద్వితీయ భార్యయందు నధికానురాగము గలదు. ఆమెకుమారుఁడైన కృష్ణదేవరాయనికి తిమ్మరుసుమంత్రి విద్యాగురుఁ డయ్యెను. కృష్ణదేవరాయఁడు సోదరులలో బుద్ధికుశలుఁడుగా నుండెను. ఈకారణములనుబట్టి తిమ్మరుసుమంత్రి కృష్ణదేవరాయనికే పట్టముగట్టించు నని యెంచి తిప్పాంబ కృష్ణదేవరాయనికి విషము పెట్టింపయత్నించెను. రాజ్యాంగముతోఁబాటు అంతఃపురజనంబును దనవశమున నున్న కారణమున నది గనిపట్టి తిమ్మరుసుమంత్రి కృష్ణదేవరాయనిం గాపాడెను. అట్లు తిప్పాంబ ముమ్మాఱు యత్నించినను గాపాడి యదిమొదలుకొని యీతనిం దనయింటనే యునిచికొనియెను కృష్ణదేవరాయండును. నది గ్రహించి తిమ్మరుసుమంత్రిని అప్పాజీ (నాయనగారూ) అని పిలుచుచుండెను.

## తృతీయప్రకరణము.

### కృష్ణరాయువిద్యాశిక్షణము.

---

కృష్ణదేవరాయఁడు పదునెనిమిదివత్సరములయీడునకు నాంధ్రగీర్వాణభాషావైశద్యమును, కర్ణాటహిందీభాషలయం దువిజ్ఞానమును, సాముగరిడీలయందు పాటవమును, విలువిద్య యందు నైపుణ్యమును, అశ్వగజారోహణాదులయందు నిరుప మానతను నేర్చి యశ్వరేవంతుఁడని పేరొందెను. ఈతనిబుద్ధి కౌశలమునకు నలరి తిమ్మరుసుమంత్రి రాజనీతిని స్వయముగా నేర్పెను.

ఇంతలో క్రీ. శ. ౧౫౦౩ సంవత్సరమున నరసరాయఁడు మృతినొందెను. అప్పు డాతనిపెద్దకుమారుఁడైన వీరనరసింహదే వరాయఁడు సింహాసన మాక్రమించుకొని తానే సార్వభౌముఁ డనని ప్రకటించెను. దానికిఁ దిమ్మరుసుమంత్రియు సమ్మతించి పట్టాభిషేకము గావించెను. కర్ణాటదేశములోని సామంతులు పెక్కురు దిరస్కరించి కప్పములు చెల్లింపకుండిరి. తిమ్మరుసు మంత్రి యాలోచించి తురుష్కులనుండి యపాయము కలుగ కుండ తుంగభద్రాతీరమున గొంతసైన్యమును, గజపతు లాక్రమింపకుండ నుదయగిరిప్రాంతమున గొంతసైన్యమును గాపువెట్టి వీరనరసింహరాయని దక్షిణదిగ్విజయమునకును కృష్ణదేవరాయనిం గర్ణాటదేశవిజయమునకును ననిపి రాజ్య భారము నిర్వహించుచుండెను.

### కృష్ణరాయనివిజయము.

కృష్ణదేవరాయఁడు బహుసేనాసమన్వితుఁడై కర్ణాటమునకు దాడివెడలి యుమ్మత్తూరు ముట్టడించి మూడునెలలు ఘోరసంగ్రామ మొనర్చి దుర్గము వశపఱుచుకొనియెను. కావేరీకనుమలలో నున్న శత్రువుల జయించి యొకరే డెల్ల పోరాడి శివసముద్రము నాక్రమించి కర్ణాటకమునకు నంతకు శ్రీరంగపట్టణము ముఖ్యస్థానము గావించి శంఖచక్రములు గలధ్వజము నెత్తించి కర్ణాటదేశములోని సామంతులందఱు నేఁటేట నొకకోటిధనము గప్పము గట్టునట్లు విధించి మరల విద్యానగరము ప్రవేశించెను. ఈవిజయమువలన కృష్ణారాయనికీర్తి దేశమంతటను వ్యాపించెను. తిమ్మరుసుమంత్రి తన శిష్యుఁడైనరాయనివిజయమునకు నానందించెను.

### వీరనరసింహరాయని విజయము.

అట వీరనరసింహరాయఁడు దక్షిణదేశంబునకు దాడివెడలి యచ్చటి వైరులను సంహరించుచు దక్షిణసముద్రము దనుకఁ బోయెను. పాండ్యచోళచేరదేశపురాజులు సుంకములు చెల్లించిరి. అతఁడు సామ్రాజ్య మంతయు సంచరించి తనప్రభుత్వమును నిలిపి భుజబల వీరనరసింహరాయఁడని ప్రసిద్ధి నార్జించి రెండుసంవత్సరములకు రాజధాని ప్రవేశించెను.

ఇట్లు వీరనరసింహరాయఁడు దిగ్విజయము గావించి మహారాజాధిరాజు రాజపరమేశ్వరుఁడు మొదలగు బిరుదముల వహించి యాఱేండ్లు పరిపాలనము సేసెను. క్రీస్తుశకము ౧౫౦౯వసంవత్సరమున జాడ్యగ్రస్తుఁడై యవసానకాలమున తిమ్మరు

సును బిలువనంపి 'మంత్రివర్యా! నాయనంతర మెనిమిదేండ్ల యీడు గలనాకుమారుడైన తిరుమలదేవరాయనికిఁ బట్టము గట్టి నీవ రాజ్యము నిర్వహింపుము. తరువాత కృష్ణరాయనికిఁ బట్టము గట్టుదువో యని నీయెడ ననుమానము గలదు. గాన నీవిపుడు కృష్ణరాయని కన్నుల బెఱికించి నాకుఁ జూపుము. అట్లు సేసినంగాని నాప్రాణములు వోనేరవుగాన తడయక యిప్పని గావింపు మనియెను. ఆమాట విరుద్ధముగా నున్నను తిమ్మరుసుమంత్రి 'రాజా! ఇదెంతపని? నీకోరిక తీర్చెదనని సెలవుగొని నెలవునకుం బోయి యిట్లు చింతించెను.

ఆహా! విద్యాబుద్ధులు గఱపి కృష్ణరాయనిం బెనిచితిని. ఏను బెనిచినవానిం ద్రుంచివేయ ఱేఁ డాజ్ఞయిచ్చెను! ఇతఁ డెంత దుష్టచిత్తుఁడు? కృష్ణరాయఁడే సామ్రాజ్యము నిర్వహింపఁ జాలుగాని యెనిమిదేండ్లవానితో నేమి కార్యమగును? అశ్వపతులను గజపతులను జయించి సామ్రాజ్యము వృద్ధిపఱుపవల సియున్నది. గాన నేట్లేని రాయనిం గాపాడుట ముఖ్యకర్తవ్యమని యెంచి కృష్ణరాయనిం బిలిపించి యాయనకు రాజాజ్ఞ దెలిపెను. ఆమాట వినఁగనే కృష్ణరాయఁడు తనకన్నులు వెఱికింపనె మంత్రి తన్ను బిలిపించెనని యూహించి తిమ్మరుసుపాదములమీఁద వ్రాలి 'అప్పాజీ! నన్నెన్నిమార్లో మృత్యుముఖమునుండి రక్షించితివి. కుమారునింబలె పెనిచితివి. మాయన్నకు గాని సామ్రాజ్యమునకుగాని నేనేమిద్రోహము సేసితి? ఏను సామ్రాజ్యకాంక్షతో దనకొమరునకు పదంపడిద్రోహము సేతునేమొకోయని యతఁడు శంకించి యుండనోపు. ఈసామ్రా

జ్యంబువలదు. జోగినై చరింతుగాన నన్ను రక్షింపుము. రక్షింప వీలులేనిచో కన్నులు వెలికింపనేల? శిరచ్ఛేదమే గావించుము. అనివందురెను. అప్పుడు తిమ్మరుసుమంత్రి రాయనిం గాంచి భయ మొందకుము. నిన్నిసామ్రాజ్యమున నభిషిక్తునిఁ జేయుదు. మీయన్న యూపిరివిడుచునందాక నిటడాగియుండుమని బోధించి మేకకన్నులు దెప్పించి వానింగొనిపోయి నరసింహరాయనికిఁ జూపెను. అతఁడాకన్నులుఁజూచి సంతసించి యుసురులు బాసెను. ఆతనియౌర్ధ్వదైహికకృత్యములు జరుగగనే కృష్ణరాయనిం జక్రవర్తిగాఁ బ్రకటించెను. అయినను తిమ్మరుసుప్రతిభావిశేషము కర్ణాటరాజ్యమునకు సర్వాంగరక్షగా నున్నకతన రాయనిపట్టాభిషేకము నడ్డగించువారు లేరైరి.

---

## చతుర్థప్రకరణము

### కృష్ణదేవరాయ పట్టాభిషేక నిర్వహణము.

తిమ్మరుసుమంత్రి 1509-వ సంవత్సరము ఫిబ్రవరి 4-వ తేదీకి సరియైన శుక్ల సం॥ మాఘ శు॥ చతుర్దశినాడు విద్యానగరమున మహామండలేశ్వరులైన మహారాజుల సమక్షమున శ్రీకృష్ణదేవరాయని వజ్రసింహాసనమునఁబట్టాభిషిక్తుని జేసెను. రాయఁడు రాజ్యభారమునంతను తిమ్మరుసుమంత్రిమీఁద నే యునిచి విద్యావినోదమున నుండుచుండెను.

## తిమ్మరుసు హితబోధ.

ఒకనాఁడు కృష్ణదేవరాయఁడు మంత్రి నవలోకించి అశ్వపతులను గజపతులను జయింప వెల్వడవలయునని వేగిరింప నతం డిట్లనియె. శత్రుజయమునెడ వేగిరపాటు కార్యసాధకము గాదు. సోదరపుత్రుని దిరస్కరించి రాజ్యమాక్రమించితివి. నీకుఁ బ్రబలశత్రులు గలరు. దండయాత్ర కేగుటకు దగు సాధనసంపద గూర్చుకొన రెండుసంవత్సరములకాలము వ్యవధి కావలయును. అనివచించి పదిలక్షలపదాతులను ముప్పది యాఱువేలయాశ్వికులను ఎనమన్నూఱు నేనుంగులను నపరిమితధనంబును గూర్చి దక్షిణదిశను నిష్కంటకము గావించి విద్యానగరమునకుఁ దనతమ్ముఁ డయినగోవిందరాజును సంరక్షకునిగా నియమించి రాయనిం బ్రోత్సహింపఁ నతఁడు తిమ్మరుసుమంత్రికి సర్వసేనాధిపత్యమున నభిషేకము గావించెను.

అనంతరము కృష్ణదేవరాయఁడు బహుళసేనాబలసహితుఁడై క్రీ. శ. ౧౫౧౩ వసంత్సరమున పూర్వదిగ్విజయమునకై వెల్వడి యుదయగిరి ముట్టడించి రెండేండ్లు గజపతిసేనలతోఁ బోరి యది వశపఱచుకొనియెను. తరువాత వినుకొండదుర్గము నాక్రమించి కొండవీటిదుర్గము గజపతులకు ముఖ్యస్థాన మగుటంజేసి దానిని ముట్టడించెను. అట ఘోరసంగ్రామము గావించి కొండవీఁడు వశపఱచుకొని కృష్ణవేణికి దక్షిణదిశను గజపతులప్రభుత్వము లేకుండ జేసెను.

### కృష్ణదేవరాయనిసాహసము.

రాయఁడు కొండవీటిరాజ్యమును తిమ్మరుసునకు నధీనముసేయ నామంత్రి రాయని విడువనొల్లక తనమేనల్లుఁడైన నాదెండ్లఅప్పామాత్యుని దాని కధిపతినిగావించెను. రాయఁడావిజయంబునం గర్వించి ప్రతాపరుద్రగజపతికి నివాసమైన కటకము నాక్రమింపఁ దలపెట్టెను. అప్పుడు తిమ్మరుసుమంత్రి 'రాజా! స్వదేశము వదలి మనము చాలదూర మరుదెంచితిమి. సేనలు బడలిపోయెను. గజపతికి స్వదేశమున బల మధికముగా నుండునుగాన నుడుగుమని బోధించినను వినక రాయఁడు కటకమునకై దాడివెడలెను. అమాత్యుఁడు సేయునదిలేక విద్యానగరమునుండి యింకను సేనలం దెప్పించితోడ్పడి రాజమహేంద్రవరము వశము సేసికొనియెను. ఈనగరము నిర్జించినసేనాని ఆకువీటియిమ్మరాజు. ఈవిధమున కృష్ణాగౌతమీ మధ్యరాష్ట్రము నెగాక గోదావరి కవ్వలనున్న యొడ్డాదిమున్నగుసంస్థానముల నాక్రమించి సింహాచలము చేరెను. రాయఁ డప్పటికిని తనివి నొందక మంత్రి వారించినను వినక తనసేనలను కటకపురినికటమునకుఁ జేర్చెను.

కృష్ణరాయఁడు వచ్చెననివిని యచ్చటివారు బలభద్రపాత్రుఁడు భీకరపాత్రుఁడు మొదలగుశూరవరు లగుపదునార్వురు సామంతరాజులు గజపతిమహారాజు నవలోకించి కృష్ణరాయనిం బట్టియిత్తుమని శపథములు వన్ని తదనుమతులై మహాసేనలంగూడి రాయని నెదుర్కొనిరి. అప్పు డిరుసేనలకుఁ బలునాళ్ళు ఘోరాహవము జరిగెను. రాయనిసేనలు మార్గా

యాసము నొందియుంటను విదేశమున రోగగ్రస్తులగుటను నా నాటికిఁ క్షీణింపఁదొడఁగెను. గజపతిసేనలు నానాటికిఁ బెం పొందుచుండెను. అప్పుడు తనకు నపజయము ధ్రువమని రా యనికిఁ దోచెను. అంతనతఁడు తిమ్మరుసు నవలోకించి మం త్రివర్యా! ఏను నీమాటవినక సంకటమునం బడితిని. ఇప్పుడు కర్తవ్యమేమి ? అని వేడిన నామహాధిపుఁడుం డిట్లనియె.

---

## పంచమప్రకరణము

### తిమ్మరుసునీతికౌశలము.

---

ఇపుడు సంగరము దుష్కరము. మరలిపో నెంచినను నీమహాగమన మతిక్రమించులోపల మనము వైరులకుఁ బట్టు వడుదుము. దైవయోగమునకుఁ జింతించిన లాభము లేదు. అయినను గొంత నీతిబలము నుపయోగించి చూతునని పలికి యాపత్సమయమున శత్రువంచన మపకీర్తికరము గాదనియెంచి పదునాఱు పెద్దపేటికలలో ద్రవిణము నింపి వానిలోపల సా మంతరాజులకు దురాశగలదను నర్థముసూచించు లేఖలను వ్రాసి యునిచి వీనిని సామంతరాజులకు నర్పించి ప్రతిలేఖలు వ్రాయించికొని రండని వచించి తమభటులను శత్రుసైన్యము లోనికనిపెను. వా రాపెట్టెలఁ గొని మంత్రిచెప్పినచొప్పున గజపతిమహారాజుసన్నిధిమీఁదుగా బోవుచుండిరి. ఆయన వా రలం గాంచి వారిం బట్టి తెప్పించి యాపెట్టెలు పరిశీలింప వానియందు లేఖలు దొరకెను. వానియందిట్లు గలదు. శ్రీకృష్ణ దేవరాయలవారు మీపద్ధతుల నంగీకరించెను. మామహారా

జువారికి శత్రుజయము నెడనే సంకల్పముగాని రాజ్యలోభమేమియు లేదు. మీరు తెలిపినవిధమున గజపతిని బట్టియిత్తురేని మీరు కోరినట్లు గజపతి సామ్రాజ్యమును మీకే పంచియీయఁగలరు అని యుండెను.

ఈ లేఖలు చూడఁగనె తనసామంతరాజులు రాజద్రోహమునకు గడంగినట్లు గజపతి నిశ్చయించుకొని వారు రాజలోభమునఁదనను రాయనికి నప్పగింతురని యెంచి యాతఁడచ్చోటు విడిచి పారిపోయెను. గజపతి గనంబడమిచే నతఁడు శత్రువులకుఁ జిక్కెనోయని సామంతరాజులు చింతించుచుండిరి. అప్పుడు తిమ్మరుసుమంత్రి రాయనిచే ననుజ్ఞాతుండయి గజపతిసాన్నిధ్యమున కరిగి గజపతికి రాయనితో సంధి కుదిర్చి రాయనికి గజపతి కూఁతు నన్నపూర్ణాదేవి యనునామాంతరముగల తుకాంబనిచ్చి వివాహము సేయునట్లు లోడంబఱచి యప్పనిఁ జేయించి యిట్లు కృష్ణరాయని సంకటసముద్రమునుండి యుద్ధరించి స్వదేశము ప్రవేశపెట్టెను.

కృష్ణదేవరాయఁడు తిమ్మరుసుమంత్రి దగుమంత్రిప్రభావంబున రాజ్యము నిష్కంటకముగా నేలుచు విద్యావినోదంబునఁ బొద్దుపుచ్చుచుఁ బెక్కురుకవులచేఁ గృతులందుటయగాక తాను ననేకకృతులొనర్చి జగమున సుస్థిరకీర్తి నిలుపుకొనియెను. కాని చరమకాలమున రాయనికి నపయశంబును తిమ్మరుసుమంత్రివరునకు మహావిపత్తును ననుభవింపకతక్కవయ్యెను.

### అంత్యదశ.

అంత్యదశయందు రాయఁడు తనలో దానిట్లు వితర్కించుకొనెను. నాతమ్ముఁడు నాయన్న కొడుకు మున్నగువారు ప్రబలశత్రులుగలరు. ఇట్లుండ నాయనంతరము నాకుమారునకు రాజ్యమెట్లు లభించునని చింతించి తానుండగనే తన[illegible]కున కాఱేండ్లవానికిఁ బట్టాభిషేకము సేసి తాను [illegible] దుర్బోధలవలన తిమ్మరుసునందును నమ్మకములేక [illegible] మంత్రియందు నమ్మిక యుంచినట్లు నటించుచుండెను. ఇట్లుండ నెనిమిదినెలలకు రాయనిపుత్త్రుఁడు జాడ్యగ్రస్తుండై చనిపోయెను.

అంత గొందఱు తిమ్మరుసుకొడుకు గోవిందరాజు రాజకుమారునకు విషము పెట్టించెనని దుర్బోధనము గావింప నామాట నమ్మి రాయఁడు తిమ్మరుసుమంత్రిని ననుజతనుజసహితముగా గారాగారమున బద్ధుంజేయించెను. అయినను తిమ్మరుసుకొడుకు గోవిందరాజు తప్పించుకొనిపోయి కొంతసేనం గూర్చుకొని విద్యానగరము ముట్టడించెను. కాని యప్పుడు రాయఁడతనిపైకి నధికసేనలం బంపఁ గోవిందరాజు గొన్నాళ్లు పోరి వారికిఁ జిక్కెను. అప్పుడు రాయఁడు తిమ్మరుసునెడ నించుకయైన కృతజ్ఞతలేక వారి మువ్వురకన్నులం బెఱికించెను.

తిమ్మరుసుమంత్రి తనకు సంభవించినయనర్థమంతయు రాజాశ్రయంబునకును రాజ్యతంత్రనిర్వహణమునకుఁ [illegible]లఁదాను గావించినకుటిలనీతివిధానంబునకును బ్రతిఫలంబని గ్రహించి పశ్చాత్తాపమొంది భగవంతునిధ్యానించుచు గొంత కాలమునకు నస్థిరతనువు బాసెను.

శివము.